# PRANAYA VIJAYAMU.

**Tirumalasetti Jagannadha Kavi**

AUTHOR OF HALASYAMAHATMYAMU

Venkatagiri Town, Nellore District.



Price As 12.

శ్రీ

శ్రీకృష్ణాయ నమః.

# ప్రణయవిజయము.

శ్రీమద్వేంకటగిరిసంస్థానాశ్రిత

తిరుమలసెట్టి - జగన్నాథకవి

ప్రణీతము.

శారదాంబావిలాస ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

చన్నపురి.

1919.



శ్రీ ర స్తు.

శ్రీగణేశ శారదా గురుభ్యో నమః.

# ప్రణయవిజయము.

పరమదయానిధిం గొలుతు భావమునందు విశిష్టధర్మసం
భరుని నధర్మనిర్మథను భవ్యగుణోదయనామరూపవి
స్ఫురుని నశేషసాధుజనపోషణు లోకహితప్రవర్తనా
చరుని సురేంద్రవంద్యపదసారసు నీశ్వరు నిష్టసిద్ధికిన్. ౧

క. కలఁ డొకఁడు సకలవిద్యా
కలితుఁడు సన్మార్గవర్తకత్వబిరుదముల్
గలవాఁడును గలవాఁడును
జలము బలముఁ జనవు ననువుఁ జాలినవాఁడున్. ౨

క. మధుకరుఁ డనియెడు పేరన్
బుధనికరము వొగడఁ బేరు వొందినవాఁడున్
మధు వొలికెడువాక్చాతు
ర్యధనంబున వినుతి గన్నయాతఁడు మఱియున్. ౩

క. తలఁచినయది జవదాఁటఁడు
వలచినయది తప్ప నీఁడు వారక తనకున్

గలిగినయది భుజియించును
దలఁగం డొకయింతయేనిఁ దనదుమతంబుల్. ౪

క. భారతఖండంబున నిజ
భారతి యెల్లెడలఁ బొలసి భాసిల్లఁగ శో
భారమణీయను సారయ
శోరమణినిఁ దగిలి మిగుల శోభిలు చుండున్. ౫

క. లోకుల కెల్లను నీతులఁ
బ్రాకటముగఁ గలయఁ బలికి రహి నొందించున్
నాకాచార్యునిఁ గేరెడు
జోకన్ దనవాక్యగరిమ సొంపు దలిర్పన్. ౬

క. బహుదేశవాసిజనులన్
బహుమతముల యుక్తియుక్తభాషితముల నీ
మహిమండలమున నాతఁడు
ప్రహర్ష మొందించి తనదువశమున నిలుపున్. ౭

క. వినుతమహాజనసభలన్
ఘనతన్ దనపలుకు మిగుల గారవమునఁ దాఁ
బనివినిపించును వారల
జను లందఱు నతఁడు గురునిచంద మెసంగన్. ౮

ఉ. భారతఖండమందు జనభావితుఁడై తగుచక్రవర్తితా
శ్రీరమణీమణీపతి ప్రసిద్ధయశుం డగు జార్జియాజ్ఞఁ బెం
పారెడుధర్మశాసనమహాసభ లాతఁ డలంకరించి శో
భారతిఁ బక్షిధర్మగతివాదివరుం డయి మెచ్చు గాంచెడున్.

క. ఆతనిద్వితీయ యొప్పెన్
నాతులలో నద్వితీయ నాఁగ గుణములన్
జేతోహర మగు నొడువుల
చేతన్ మృదుభాషిణి యని చెందె నభిఖ్యన్. ౧౦

ఉ. ఆయెలనాఁగ నాగరత నాంగ్లవచోమహనీయపాండితీ
శ్రీయుత పుంసమాజములు చేకొని తన్ వినుతింప సర్వదే
శాయతనోల్లసత్సభలయందు నమందవచోరుచిన్ దిగం
తాయతకీర్తిపంకజదలాక్షిని గాంచె ననుంగునెచ్చెలిన్.

క. మగనికి సహచారిణి యై
తగవ్రతగములను స్వబుద్ధిఁ దా నేర్పఱుచున్
విగతభయశీల యగు న
మ్మగువ యభీరుక యనంగ మాన్యత నొందెన్. ౧౨

క. రూపమునఁ జతురవచనా
టోపంబున వివిధకృతిపటుత్వంబున ధీ
దీపంబున ద్వీపంబున
నాపంకజముఖికి సాటి యరుదు సతులలోన్. ౧౩

చ. దయితునిఁగూడి నెచ్చెలులు దారును దోనరుదేర దీర్ఘప్రం
బయనములన్ విదేశములప్రాంతపురీముల కేగి సద్వచో
నయయుతిచే జనంబులమనంబుల నుల్లసిలంగఁ జేయు న
ప్పయిదలి మేదినిన్ దనప్రాభవవైభవంబు లేర్పడన్.

క. పతియు వివిధాంగ్లవిద్యా
వితతుల నెల్లెడలఁ బెద్దపే రొందెను ద

తృతీయుఁ దదీయకలానివ
సతి యఁట యిఁక వారియొప్పు చాట వలయునే. ౧౫

క. ఆదంపతులకుఁ బరమశు
భోదయగుణు లైనతనయు లుదయించిరి తా
రైదుగురు ముగురు కూఁతు
లొప్పిదిగ నిర్వురును గొడుకులుం గా నెలమిన్. ౧౬

క. కమలయు విమలయును మనో
రమ యనఁ గూఁతులకుఁ బేళ్లు రాజిల్లు నిఁకన్
దమనుఁడు దుర్దముఁ డనఁగాఁ
గ్రమమునఁ గొడుకులును బిలువఁ గాఁ బడుదు రిలన్. ౧౭

మ. నవవిద్యాచతురత్వముం గొలుప విన్నాణంబుతోఁ దండ్రి
సం, స్తవనీయోన్నతపాఠశాలలఁ బ్రశస్తప్రక్రియన్ జేర్చి
యాం, గ్లవరాచార్యులతోఁ గుమారులను దత్కాంతాలి
తోఁ గూఁతులన్, సువినీతిం జదివించె నంచితజనస్తోత్రో
ఘపాత్రంబుగాన్. ౧౮

క. కమలకు ననుజుఁడు దమనుఁడు
విమలకు దుర్దముఁడు పెద్ద విమలాంగి మనో
రమ కొండిక యొప్పులగని
యమరెం దనముద్దుచెయ్వు లందఱఁ దనుపన్. ౧౯

క. చదివిరి చదువుల నెల్లను
బదలముగా వివిధదేశభాషల జవరుల్

ముద మందఁగఁ బెరిమం దగఁ
బొదలిరి దమనుండు దుర్దముండును సరవిన్. ౨౦

మ. వినుతాంగ్లేయకలాసమూహమునఁ బ్రావీణ్యంబునన్ దేశ
భా, షను బాండిత్యము నత్యమై వెలయ విజ్ఞానంబునన్
లోకలో, చనపర్వప్రద మైనరూపమును జంచత్కాంతి
రత్నోల్లస, త్కనకంబుంబలె భాసిలన్ సుతలద్వాద్వం
బొప్పె నద్వంద్వమై. ౨౧

క. నానావిధశిల్పంబుల
గానంబున నృత్తవాద్యకళలను రమణీ
యానూనకౌశలంబును
మానవతు ల్గాంచి రంత మానితరీతిన్. ౨౨

క. పిన్నది యైన మనోరమ
సన్నుతగుణములు మనోజ్ఞసౌందర్యంబున్
దిన్ననితియ్యనిపలుకులుఁ
గన్నది కన్నడ యొనర్చెఁ గరము చదువులన్. ౨౩

క. తనతోడిముద్దుచిఱుతుక
లను గూడం జేరి యాటలను మరగినదై
ననబోఁడి చదువఁ బోవదు
తనయప్పలతోడ బసికిఁ దండ్రి యనిపినన్. ౨౪

క. ముద్దులు గులికెడుదానిన్
ముద్దియ మృదుభాషిణియును బోరాడదు తాఁ

బెద్దయుఁ గూరిమిఁ బ్రియముల్
తద్దయు దానికి నొసర్చి లాలించు రహిన్. ౧౫

ఆ. చిఱుతకూఁతుచిన్ని చిన్నెలఁ జూచుచుఁ
బ్రమదసలిలపూర్ణవదన యగుచుఁ
దనదుమదిని దల్లి తమకులంబున కిది
తలఁపుమానిక మని తలఁచు చుండు. ౧౬

ఆ. నిజకులానురూపనియతి నొప్పారెడు
గొనము వర్తనంబుఁ దనరి యుంట
విద్దె పెల్లు లేమి వెగటుగా దయ్యె నా
కన్నె కయ్యె నదియు వన్నెగాఁగ. ౧౭

క. చదివెడువారలతోడన్
జదువక యునికియుఁ గరం బసహ్యం బౌటన్
మృదుశీల మేనయత్తన్
గదిసి మరగి యుండె నదియు గారాబమునన్. ౧౮

ఆ. దానిమేనయత్త మానవత్యభిధాన
ధర్మచారిణీవ్రతంబు గలది
తనసహోదరుండు దినకరాహ్వయునింట
నుండె నతఁడు తన్బహూకరింప. ౧౯

చ. దినకరుఁ డొప్పెసంగె సముదీర్ణత సర్వకలానిధానుఁడై
ఘన మగునాంగ్లరాజ్యమున గారవమూర వరాధికార మిం
పొనరఁగఁ బూని బంధుజను లున్నతిఁ దన్ను నుతింప వేదవ
ర్త్మనిరతుఁడై ప్రజాతతికి రాజనరున్ బ్రమదంబెలర్పఁగన్.

క. సుమతియు సుశీల యనఁగా
యమళులు తనయుండు తనయ యై రాతనికిన్
సుమహోన్నత గుణశీలురు
రమణీయాంగులు కులాభిరామసుచరితుల్. 31

ఆ. దినకరుండు దేశమున నధికారంబు
పూని యుంట రాజధానియందుఁ
బోలె నచట బడులు వొనరక యుండుట
నాంగ్లవిద్య వారి కమర దయ్యె. 32

క. జ్ఞానవయోవృద్ధుండును
మానితగుణభూషుఁ డైనమహీసురవరుతోఁ
బూనికమైఁ జదివించె
న్నానక వారలను దండ్రి నయము దలిర్పన్. 33

క. నేరిచిరి సంస్కృతంబును
నేరిచిరి స్వదేశభాష నేర్పునకుఁ బితల్
కూరిమి లోనం బొదలఁగ
వారలు బందుగులు నెల్లవారలు మెచ్చన్. 34

చ. ఎలమిని దన్ను నెచ్చెలులు హెచ్చుగమచ్చిక మెచ్చి క్రీడలన్
బలసి భజించి యుండఁగ ననావిలబుద్ధియు రూపవైభవం
బలరఁగఁ దారకాగణమునందునఁ జందురు కైవడిన్ విరా
జిలు ననయంబు తేజున సుశీల నిజాంబ ముదంబు వొందఁ
గన్. 35

చ. ఒనరఁగ ధర్మవేది యగునొజ్జ కరం బనురక్తితోడ నే
ర్పినవిధ మొప్పుగా హృదయపేటి ధరించి తదుక్తమైన వ
ర్తనమున నిల్చి నించుకయు దాఁటదు విప్రకులాంగనా
మణుల్, తనయల కెల్ల నాత్మచరితం బుపమానము గాఁ
గఁ జేర్చెన్. ౩౬

క. పెద్దలు విచ్చేయంగాఁ
దద్దయు సంప్రీతి గదురఁ దగ నెదురుకొనున్
గద్దియ నొసంగి మ్రొక్కును
ముద్దియ డెందంబు భక్తిపూర్ణము గాఁగన్. ౩౭

క. బృందావనంబునకు నా
నందముతో సతి ప్రదక్షిణంబులు సేయున్
మందాడి వివిధసుమముల
నందముగాఁ బూజ చేసి యనుదినము తగన్. ౩౮

క. సుగుణాలయ యని బంధువు
లగుజను లెల్లరును దన్ను నరయుచు మెచ్చన్
ముగుద కడానికి మణివలెఁ
దగువిద్దెకు సచ్చరిత్ర దనరఁగ నొప్పెన్. ౩౯

క. తనమేనయత్త గారవ
మున నమ్మానవతి ప్రియము పొనరఁగఁ దను లా
లన సేయ సుశీల చెలిన్
మనోరమను గలసి మెలసి మచ్చిక మరగెన్. ౪౦

చ. అదియును సుశీలతోడఁ గలయం జరియించుచు దానిమన్న
నన్, మదిఁ బ్రమదంబు వొంగ నసమానత నెప్పుడు జోడు
వీడక, చ్చదువులయయ్యెయున్ దనుఁ బ్రసన్నమతిం దిల
కించి నేర్పఁ ద, త్సదనమునన్ మెలంగుచును దా మఱ
చెన్ దనతల్లిదండ్రులన్. ౪౧

ఆ. తండ్రియింటఁ జదువుఁ దా నొల్ల కున్నను
నిట సుశీలతోడ నెనయుకతనఁ
గలసి చక్కఁ జదివె నెలమి మనోరమ
పిన్నతల్లిదండ్రు లెన్నుచుండ. ౪౨

క. కులపాలికలకు యోగ్యం
బు లైనపాఠంబు లన్ని మోదంబున బా
లల కొజ్జయు బోధించెను
నిలింపభాషను స్వభాష నేర్పులు మీఱన్. ౪౩

తే. సచ్చరిత్రయు విద్యయు నచ్చముగను
నేర్చి రెంతయు సరిగాఁగ నెలఁత లిట్లు
తమగుణంబును నేర్పును రమణఁ గాంచి
యెల్ల జనులు నుల్లముల నుల్లసిల్ల. ౪౪

చ. సుమతియు వన్నె కెక్కె నలచొక్కపుబాల్యమునందు
పొంది ని, స్సమముగ దేవభాషను సుసాహితి నైజవచో
నిరూఢియున్, గ్రమమున నెల్లధర్మముఁ బురాణములన్
ద్విజనర్తనోచిత, క్రమమును దండ్రియుల్ల మలరన్ వడి
నేరిచె నద్భుతంబుగన్. ౪౫

ఉ. ఆయతశాస్త్రమార్గవిదుఁడై యమలాత్మకుఁ డైనయయ్యు
పా, ధ్యాయుఁడు సర్వముం గఱపె నాతని కాతనిబుద్ధి దీప్త
ర, త్నాయితమై సమస్తమును దాఁ బ్రతిబింబముఁ బోలెఁ
జేకొనెన్, బ్రాయము లేఁతయై యలరువాని జనుల్గని
యబ్రబ మందఁగన్. ౪౬

తే. ఆంగ్లభాషావిచక్షణు లైనయొజ్జ
లచట దొరకమి నిపుణత నందు నొందఁ
జాలఁ డయ్యెను సుమతి యబ్బాలుఁ డంత
తెలివి గలిగియు నితరభాషలను జేర్చి. ౪౭

క. దినకరుఁడు వగచు నెద నను
దినమును సుతుఁ డాంగ్లభాషఁ దెలిమిచే నా
తనియనుపమబుద్ధికిఁ గడు
మనంబునం దగఁ బ్రమోదమానుం డయ్యెన్. ౪౮

మ. ఒకనాఁ డంత సునిశ్చితాత్ముఁ డయి యెంతో ప్రీతితోఁ
జెల్లెలిన్, సుకృతాచారపరాయణం బిలిచి తానున్ భార్య
యున్ దానితో, సకలం బైనగృహస్థితిన్ సుతులయా
చందంబుఁ జర్చించుచున్, బ్రకృతార్థంబు గుఱించి యిట్లు
పలికెం బ్రావణ్య మొప్పారఁగన్. ౪౯

తే. మానవతి నీవు సర్వధర్మముల నెఱిఁగి
యాచరింతువు లోకనయంబునందు
నెఱుక గలవు నిర్మలమతి వేను గార్య
మందు నెపుడు నీబుద్ధి సాయంబుఁ గొందు. ౫౦

సీ. నాపూన్కి యొక్కటి నయము మీఱఁగ యుక్తి
నారసి తెలుపఁగఁ గోరినాఁడ
సుమతికిఁ బండితుం డమరభాషను దేశ
భాషను జాతురిఁ బరఁగఁజేసె
నాంగ్లభాషకు నొజ్జ యల్పజ్ఞుఁ డగుటను
దాన వానికి నేర్పు గాన రాదు
దానికి నొండుపత్తనమున కాతనిఁ
బనుపంగవలయు సవశ్యముగను
బూర్ణవిద్యాలయోపేతపురములందు
నేది దలఁచిన నిటకు దవ్వేది యర్హ
మెట్లు పంపఁగా నగు నితం డెట్లు లొంటి
యుండు నట నని వగతు నే నుల్లమందు. ౩౧

శా. ఈకాలంబున హూణవాణిచదువే యోష్యంబు దానంగదా
లోకంబందు సువృత్తియున్ గరిమయున్ లో నెల్లఁ బ్రా
ప్తం బగున్, మాకుం బోలెను వీనికిన్ వలయు సంపా
దింపఁగా హూణభా, షాకౌశల్యము తత్పరీక్షలు దగన్
సాధింపఁగాఁ దొయ్యలీ. ౩౨

ఉ. ఏనగరంబునందుఁ దగు నిమ్ముల నుండఁగఁ బాఠశాలలో
వీనికిఁ జక్కఁగాఁ జదువ వీలగు విఘ్నము లేక దాని కె
ట్లేనియుఁ దోడుగా నటకు నెవ్వరు పోవుదు రంచు నామదిన్
మానవతీ వితర్క మిది మానక బుద్ధిఁ దలంచి చెప్పుమా.

క. కానఁగ సర్వకలాశా
లానిలయము నగర మిందులకు దవ్వే దేన్

మానితశీలా వాకొను
పూని విమర్శించి తగవు పొం దగురీతిన్. ౫౪

తే. సుమతి సంస్కృతభాషయం దమర జ్ఞాన
సంపద గలందు దాని కే సంతసింతు
నిదియుఁ బరమార్థ మగు నైన నిహముకొఱకు
నాంగ్లభారతిఁ జేరిమి నందవలయు. ౫౫

క. ఇంతయుఁ బలికినయన్నకు
నింతియుఁ దనలోనఁ దా నొకించుక చింతన్
దంతురితభ్రూలత యై
యంతన్ వదినెయు వినంగ ననియెన్ గూర్మిన్. ౫౬

క. అందుల కేలా యింతయు
నందురిదెవు దాని కెట్లు వలయునొ యట్లే
పొందుపడున్ జింతింపకు
ముందుగఁ జేయంగ వలయు మొగిఁ జేయు మనా. ౫౭

క. సుమతికిఁ బది రెం డేఁడులు
క్రమమునఁ జనియెన్ సుశీలఁ గాంచఁగ నుద్వా
హమునకు సిద్ధై తగ ను
త్తమచరితా మున్ను దీనిఁ దలఁపుము మదిలోన్. ౫౮

క. వడుగుం జేయుము సుమతికి
వడిఁ బెండ్లిం జేయవయ్య బాలికకుఁ దగన్
దడయఁగ రా దిఁక నప్పని
గడనకు నగుసజ్జతనఁ గావింపు మనా. ౫౯

ఉ. నామది సాలకింపు మన నల్వును జెల్వును మీఱి సన్నుత
స్థేమయు సచ్చరిత్రయు సుశీలకుఁ దోడును నీడ యౌ గుణా
రామకు మామనోరమకు రట్టొకయింతయుఁ బుట్టకుండఁ
గాఁ, బ్రేమఁ దగ న్వివాహమును వే ఘటియింపు సుశీల
తోడుతన్. ౬౦

ఆ. అన్న మిన్నకుండ మున్నట్లు లేఁ జేయఁ
దగు నటంచు బుద్ధిఁ దలఁచె దేమొ
వానిఁ దెలుప కిట్టు లేను నీకుం జెప్ప
నేమి హేతు వనుచు నెంచె దేమొ. ౬౧

చ. అదియును జెప్పెద న్వినుము హంకృతిఁ జేర్చి యతండు
ప్రేమతోఁ, నుదితము నీతియుక్త మెద నొల్లఁడు గైకొన
నెంత సెప్ప నిం, పొదవునె తన్మతం బెఱుఁగమో మఱియ
వ్యాధి నేను వానిఁ, ల్లదియుఁ బరిత్యజించుటకు నైననిమి
త్తము నీకుఁ గ్రొత్తయే. ౬౨

ఉ. ఏనును బాల్యమంద పతిహీనను దల్లియుఁ దండ్రి లేని దా
దానను దొక్కముం గలుగు దానను యుండను జోటులేక
యున్, మానితు లౌ సహోదరులమన్నన నన్నము గన్న
దాననే, కాని స్వతంత్రయుక్తి మనఁ గాంచినదానను గాను
సోదరా. ౬౩

మ. అతఁ డర్థాధికతం బ్రమత్తుఁడు మహార్థాధీశులౌ గొప్పవా
రతుకం బల్కినఁ జెల్లుఁగాని యబలన్ హైన్యస్థితిన్ గన్న
న, న్నతఁ డేమీ కడకంటనేని కనునే యీమాట నీడం

దగున్, గృతకృత్యుండవు నీవు కమ్ము విధియుక్తిం జేసి యీ కార్యమున్. ౬౪

కం. చెప్పఁగ లే దని తలఁపకు
మెప్పులు పలికిన నతండు మేకొను మదిలో
నొప్పులు సెప్పిన నొల్లఁడు
చెప్పి గదా యిల్లు విడిచి సేరితి నిన్నున్. ౬౫

ఆ. చిఱుతనాఁడు ధర్మ మెఱిఁగినపెద్దల
కరుణఁజేసి యించు కరయఁ గంటి
ధర్మపరులచరితఁ దద్విధం బొకకొంత
నడువఁ గంటి సుఖముఁ బడయఁ గంటి. ౬౬

ఆ. ధర్మనిష్ఠవలనఁ దనయంత నగుసుఖ
మెంత ధనముచేత నేనిఁ గలుగ
దర్థ మల్పసుఖ మనర్థాకులం బంచు
వేదవిదులు నొడువ విందు గాదె. ౬౭

కం. ధర్మంబువలనఁ జిత్తము
నిర్మల మగు దానివలన నెఱి యగు దానన్
ధర్మమె గతి యని నమ్మికఁ
గర్మము నిజకులకృత్యంబు గావింపఁ దగున్. ౬౮

ఆ. నీవు సర్వ మెఱుఁగునిర్మలాచారుఁడ
వమలమతివి నీకు నమరఁ గఱపు
దానఁ గాను గాని తెఱఁ గని యిప్పటి
పని తెఱంగుఁ దెలియఁ బలుకుదాన. ౬౯

చ. కమలకు నిర్వదేం డ్లాదవెఁ గానదు పెండిలి దానితమ్ముఁడౌ
దమనుఁడు రెండువర్షములు దానికిఁ బిన్నయగున్ దలంప
దు, ర్దముఁడును వత్సరద్వయము తగ్గెడువాఁ డగు వానికిం
దగన్, విమల చతుర్దశాబ్ద యగు నీతిఁ గనం డతఁ డెంచి
చూడుమీ. ౨౦

క. పిన్నది యైనమనోరమ
సన్నుతగుణ మనసుశీల సరియీ డెపుడున్
గన్నది నాతో మచ్చిక
నున్నది మనయింట వారి నొల్లదు వింటే. ౨౧

క. ఆరయ నాతో మెలఁగియుఁ
గూరిమితో మనసుశీలకూటమి గనియున్
వారల చరితము లొల్లదు
కారణ మిది దానిపెండ్లి గావింపు మనన్. ౨౨

చ. కమలకుఁ బెండ్లియీ డగుటఁ గాంచినతోడనె యేను వా
నిఁ బ్రజే, మము దగఁ జేరి యెంతయును మన్ననఁ జెప్పితిఁ
బ్రాప్తకాలముల్, దమనునకున్ ద్విజోచితవిధానము రెం
డును వేగ పూని చే, యు మని యతండు నాపలుకు నుద్ధ
తుఁడై వినఁ డయ్యె నంతటన్. ౨౩

చ. అలయక యేను బూని తెఱియం జని కార్యము నుగ్గడించు
చోఁ, బ్రలయయమాకృతిం గినిసి ప్రల్లద మాడుచుఁ దేర
తిండికై, నిలయముఁ జేరి తీ విటులు నీకును రాచఱికంబు
లేల నా, యిలు విడి పొమ్ము పొ మ్మనుచు నేపున నాతఁడు
తిట్టుఁ దిట్టెసన్. ౨౪

ఉ. ఒండొకయింటికిం జనఁగ నోపక యేనును గాశికేని బ్ర
హ్మాండములోన నెచ్చటికి నైనను బోయెద బిచ్చ మెత్తినన్
బిండము చిక్కదే యనుచు నెమ్మది నమ్మలికంబు నార్చికొం
చుండఁగఁ గూర్మి నీవు నను నుంచితి వింటను నింతకాల
మున్. ౭౫

మ. అరయన్ హూణవచోనిరూఢిమెయి లోకాభ్యున్నతిం
గన్న పె, క్కురఁ గంటికిన్ నినుబోఁటిశీలగుణయుక్తుం గానఁ
గా నేర నో, క్కరు వీరందఱు చందముం గనితి రొక్కం బె
పరబ్రహ్మ మం, దురు వేఱొక్కటి గాంచ లేరు గుణమున్
దోషంబు నే నొప్పఁగన్. ౭౬

మ. తనరన్ బ్రాహ్మణజన్మ ముత్తమ మయత్నప్రాప్తమా
పేర్మి వాం, దినయంబున్ దిగనాడి బంధుజను లెంతే సేవ
గింపన్ మహా, ఘను లైన ట్లవిచారదోషమున యుక్తం
బున్ విమర్శింప కా, త్మ నధోలోకములోపలన్ బడఁగ
వ్రేఁతా జూడ వ్రేఁ గయ్యోహన్. ౭౭

ఉ. లాప్యధనాబు లొందినను లాభ మొకింతయు లేదు వీరికిన్
భావమునందు ధర్మగతి పాయక యుండినఁ గాని సౌఖ్యమిం
పావహిలంగఁ గల్గదది యంతరమందుఁ దలంప రెప్పుడున్
గావున వీరు నిత్యము ధనంబు గడించెడుకష్టభాగులే. ౭౮

చ. నిజకులవర్తన న్నడచునీతిఁ దొఱంగి మహేమిదానముల్
నిజ మొనరించినం గలుగ నేరదు ధర్మము పాత్రవెల్పులన్
రజము దొలంచి లోనఁ దసరం బరశోధన సేయ లేని దా

న జలముఁ ద్రావఁగా నగునె న్యాయముగన్ బరికింపు
నెమ్మదిన్. ౭౯

ఉ. బంధులయొద్ద గౌరవము పాసిన నొంటు యశంబు కల్గి జా
త్యంధునకున్ జెవుల్ గలిగినట్టుల యయ్యదిగొప్ప యే మహా
కంధిని వర్షముల్ గురియఁగా నగు నే ఫల మట్లు గావునన్
బంధులచేతఁ జేరిమి గన న్వలయున్ భువి సజ్జనుం డౌగన్.

క. తనపిత పితామహుండును
జని దేనిం దాను నట్టిసన్మార్గమునన్
జనఁగా వలయున్ దానన
గను సద్ధర్మం బటండ్రు కల్యాణవిదుల్. ౮౧

ఉ. కావున ధర్మమున్నతియుఁ గాంచఁగ నెంచెడువాఁడు బంధుస
ద్భావముఁ బూర్వపూరుషగతంబుఁ గులోచితవర్తనన్ దిగం
ద్రోవక యాచరించు నమరన్ దగ వానికి సర్వధర్మసం
భావన లంచుఁ జెప్ప వినమా బుధవర్యులు నిక్కువంబుగన్.

చ. పురుషునిసత్యభావమును బోఁడిమి నేర్పులుపంగఁ గోరునే
నరసి యెఱుంగఁ గావలయు నాతనియాంతరవృత్తి బాహ్యా
మా, పెరిమను గన్న చోట నరవి న్నిజ మేర్పడు నే య
టంచుఁ జె, ప్పరె నయకోవిదుల్ ధిషణభార్గవముఖ్యులు
పండితోత్తమా. ౮౩

ఆ. దూరవర్తిజనులతోడి మెలఁకువ
వలన మనుజప్రకృతి తెలియ రాదు

ఆంతరంగిక మగునాతనివర్తన
మరసి యెఱుఁగవలయు నరునిప్రకృతి. ౧౪

క. తనతలిదండ్రులతోడం
దనదుసతీసుతులతోడఁ దనబంధులతోఁ
దనవృత్తియె తార్కాణము
మనుజునిజప్రకృతి కనిరి మాన్యు లగుబుధుల్. ౧౫

చ. ఎఱుఁగుదు వానియాంతరము నేను జిరంబును దద్గృహంబు
నన్, దఱియుచుఁ గూడి యున్నకతనన్ నిజ మాడెద నాల
కింపు వాఁ, డెఱుఁగఁడు ధర్మమార్గగతి యింతయుఁ దత్ఫల
దాత నీశ్వరున్, మఱి యెఱుఁగండు సాధువులమన్నన
యె ల్లెఱుఁగున్ సహోదరా. ౧౬

ఆ. వానితోడి దేమి పని నీకు వానికై
కులముపాడి తగునె తొలఁగఁ ద్రోయ
వానిత్రోవ వానిఁ బో నిమ్ము నీపనిఁ
జేసి యీవు పుడమి వాసి గనుము. ౧౭

క. తఱిఁ జేయనికార్యంబులు
వితథములై చను నకాలవిహితము లౌచున్
దఱి దాఁటిన ఘనవర్షా
గతి నాటినవిత్తనంబుగతి సోదర్యా. ౧౮

క. కావున నీడునఁ జేయం
గావలయున్ వధుగు పెండ్లి గాని సుతులకున్

భావించి సేయ కుండిన
వావిరి లే విహముఁ బరము వారికి మీఁకున్. ౮౯

ఆ. ఇంతపట్టుతోడ నింతి మాటాడఁగా
నగునె యంచు బుద్ధి నలుగ కయ్యొ
నన్ను మేలుపఱిచి మన్నింతు కావున
హితము పలుక వలసె నింతవట్టు. ౯౦

క. అని పల్కుమానవతికిన్
దినకరుఁడు స్మితంబు వొలయ నెమ్మొగమునఁ ది
య్యనిమృదుతర భాషణముల
ననియెం దనదయిత వినఁగ నాదర మొప్పన్. ౯౧

ఆ. అలుక యేల యీవు పలికినపలుకుల
కగును మాహితంబ యరసి తీవు
సర్వ ముజ్జగించి శాంతిమై నున్నట్టి
నీకు నేమి వలయు లోకమందు. ౯౨

ఆ. చెలువలందు ధర్మశీలంబుల నెఱింగి
దోస మింత లేక వాసి గన్న
దాన వగుట నీదుమానితవాక్యము
మాకు నెక్కుడగు ప్రమాణ మమ్మ. ౯౩

ఆ. ఏన కాదు చెలియ యీచారుమతియును
దీనిబంధువులును దిరము గాఁగ
నిన్ను గారవించి నీపంపు సేయుదు
రెల్లవారు దీని కుల్లసిల్ల. ౯౪

ఉ. ఆతనియిల్లు వీడి యిట కాదటఁ జేరిననాఁటఁగోలె నీ
యాతతసద్గుణంబులమహత్త్వమునన్ గృహమందు నుంద
ఱున్, నీతలఁపే ప్రమాణముగ నెమ్మిఁ జరింతురు గాదె
యీవునన్, బ్రీతి మనంబునం గదుర వీరల సారెకు నాద
రింపఁగన్. ౯౫

ఉ. పిన్నటనాఁటనుండియు సువృత్తమునందున నీదుబుద్ధి ని
త్యోన్నతి నిల్చి యుండుఁ దగ నుద్ధతురాలవు కావు పెద్దలం
దున్నతితోడ వర్తిలుదు తుచ్ఛములన్ మదిఁ గొల్ప వందు
నన్, సన్నుతిఁ గాంచి తీవు భవనంబున బంధుసమాజ
మందునన్. ౯౬

ఉ. కావుననే కదా ఋతుఁడు కార్యమునందు నిన్నున్ దలంచి నీ
భావము నారయంగ మదిఁ బాయక కోరితి నీవు నైజస
ద్భావముతో హితంబు నుడువంగల వెయ్యది దానికన్న నా
కేవిధమైన వేఱుతలఁ పెందును గల్గునె మానినీమణీ. ౯౭

ఉ. వానికి నేమొ దైవగతి భావము లవ్విధ ముప్పతిల్లె నే
మేనియుఁ జెప్పఁ బూనినను శ్రేష్ఠుఁ డతండు సమంచితాధిక
శ్రీనిధి లోకమానితవిశేషసమున్నతిఁ గాంచి యున్నవాఁ
డై ననుబోఁటివానికులు కర్మిలి నూఁకొనునే తలంపఁగన్.

క. ఏను గరగ్రాహిపదముఁ
బూనుచు నున్నాఁడ నిదియు భువనస్తుత్యం
బైనను నాతఁడు నను స
న్మానింపం డిదియు వాని మది కల్పమగున్. ౯౯

క. బహుజనసహవాసమునన్
మహిఁ దిరుగుట నెఱుకపడెడు మాకీలోకం
బుహితాహితగతులం దన
సహితమతి యతనికి నెట్లు వచ్చు నెఱుఁగఁగన్. ౧౦౦

క. న్యాయస్థానంబులలో
నాయాపక్షంబు లూని న్యాయ్యము లైనన్
న్యాయాపేతము లైనన్
బాయక వివదించువారు వగ లెఱుఁగుదురే. ౧౦౧

క. వేదోక్తం బగు కర్మము
గా దని పలికెదరు వీరు గాంచిన దేమీ
యాదిం జేయక యది యో
పాదిల్లదు కర్మమునకు ఫల మటు గానన్. ౧౦౨

క. హేమంతంబున ఫల మగు
నేమంబునఁ దప్పదనెడు నెఱి నమ్మి జనుల్
ధీమంతులు చైత్రంబున
భూమిం దున్నుదురు దీని బుద్ధిం గనరో. ౧౦౩

క. సభలందుఁ దోఁచినంతయు
సభవారలరంగ నాడి చప్పట్లు గొనన్
ప్రభువులు విభవోద్భాసితు
లభయప్రీడాభిమానులై తగుదు రిలన్. ౧౦౪

మ. అది యట్లుండెను నన్ను దొక్కగతి యస్వం బరొయ్య నా
దంచు నా, మది సంతాపము వొందు బంధుగులసమ్మా

నంబు లేనట్టిసం, పద లెంతేని గడింప నేమి యటవీమ
ధ్యంబున న్వెన్నెలల్, గదురం గాచినయట్లు గాదె యిది
యుల్లంబందుఁ గారించెడిన్. ౧౦౫

మ. ఊతఁ డసన్నతమెుల్లఁ డంచనఁగ నేలా యింక నే వానిసం
గతి నుండం దగు నన్న సాధుజనతాగర్హ్యుండనై దాని నే
గతి నొప్పం జను నైహికంబుఁ బరలోకంబుం ద్యజింపంగ నే
రుతు నేరీతి ని దెప్పుడు న్సనము నేర్పుం జిచ్చుచందంబునన్.

మ. పరలోకంబునకై శ్రమంపడుట దా వ్యర్థం బనుం గాని య
వ్వెర వేయుక్తి నతం డెఱింగెనఁట సంప్రీతిన్ మహాప్రాజ్ఞులి
ద్ధరలో దుష్కరమున్ బహుద్రవిణసాధ్యం బైన సత్కార్య
మె, ల్లరు యత్నంబునఁ జేయువార లిది చాలన్ నేరఁ
గాఁ జాలరే. ౧౦౭

మ. విహితాచారము కీడొసంగు నది సేవింపంగ రా దందురే
మి హితం బింక నటంచు వారి నడుగ న్నేకొందు నే వారి
పూ, న్విహితం బందుర యేని దానరు భువిన్ గీడింత రా
దంచు నె, వ్వాహి భావ్యర్థము నిశ్చయింతు రిదియు న్వా
రర్థి భావింతురే. ౧౦౮

క. మాతండ్రి యాంగ్లభాషను
ఖ్యాతుఁడయి వహించెఁ గాని యధికారములన్
బూత మగుచరిత విడువం
డీతండు ఘనుండు విడిచె నీనాఁడు కటా. ౧౦౯

ఆ. వేదవేదిశీలవిలసితం బైన మా
వంశమునకు నేఁడు వాసి దఱఁగె

మధుకరుండు హేతు వధిక మాడఁగ నేల
దైవచేష్టితంబు దాఁట నగునె. ౧౧౦

సీ. ఆర్యజనశ్రేష్ఠులై మనపూర్వులు
పోయినసత్పథంబునన మనము
నిలిచి యున్నారము తలఁగి యాతఁడ మన
వారిని మనలను వదలి చనియె
మనదోష మొకయింత గన రాదు దీనియం
దున్నచోటన మన మున్నకతన
నయము దొలంగినభయము లేదు మనకు
బంధులమతి నున్న వార మగుట
జనులయాడికోలు మనమీఁదఁ గలుగదు
విషయ మెల్ల లోకవిదిత మగుట
మనకుఁ గార్య మిదియ మనుమార్గమును బట్టి
మనలపూర్వు లట్లు మనఁగ వలయు. ౧౧౧

ఆ. ప్రకృత మనుసరింతము కృతోపనయనునిఁ
జేసి దూరదేశవాసమునకు
సుమతిఁ బంపు టుచిత మమర నీ వన్నట్లు
సుతకు బెండ్లిసేఁత శుభమె కాని. ౧౧౨

చ. తగువరు బంధువర్గమునఁ దాల్మి సుశీలు గుణశ్రుతాఢ్యు ని
ష్ఠుగఁ బరికించి కాంచి మునుమున్నుగ నిశ్చయముం బొన
ర్చి కా, దె గడన సేయఁగాఁ దగును దీవరపాటు పొసంగునే
యిటన్, వగచెద దీనినే యెపుడు వారక వీడెఁడి నే యుపే
క్షకున్. ౧౧౩

చ. మఱి యొకమాటఁ జెప్పితివి మానక దానికి మంతనంబు నే
మఱక యొనర్పఁగా వలయు మన్నన చేసి యతండు మెచ్చి
తా, నఱమర లేక యొప్పినఁ గదా మన మాతనికూఁతు
పెండ్లియున్, నెఱి యగుఁ జేయ దానికి గణేయు వరుం
దడవంగ వల్వదే. ౧౧౪

క. ఎది యిపుడు ప్రాప్తకాలం
బది చేయుద మవల వలయునవి యవి యెల్లన్
గుదిరిన నుద్వాహంబులు
పదిలముగాఁ జేయ రాదె పరికింపు మదిన్. ౧౧౫

తే. సుమతి కాంగ్లవిద్యాపరిశ్రమము సేయ
నీడు మీఱెడు దానికై యొచటి కైనఁ
బనిచినంతట వడుగు సేయును విలంబ
మగును గావున నదియ ప్రాప్తావసరము. ౧౧౬

క. అనిన జ్ఞానవతియు ని
ట్లనియెన్ దినకరునితోడ నర్మవిధమునన్
జన విచ్చి తెంకఁ బలికెద
వినుఁడీ వదినెయును నీవు విశ్వాసమునన్. ౧౧౭

క. వరులు తగువార లిప్పుడు
ధారుణిఁ దని యెంచి కాదె దొరఁకొనవు సుతా
పరిణయమున కుందలి నా
తురయు తెలుఁగు తేటపఱుతు నాలింపు దగన్. ౧౧౮

క. ఘనుఁ డాంగ్లేయకలానిధి
వినయాభరణుండు వేదవేదికులమునఁ
జనితుఁడు వినుతచరిత్రుఁడు
కనవే మనవేదనాథుకమలోదరునిఁ. ౧౧౯

క. కమలోదరుఁడ యనం దగు
విమలాకారమున వితతవిద్యను మఱియుఁ
దమలో మీకు న్వారికి
సమ మగు సంబంధ మరయ సర్వవిధములఁ. ౧౨౦

తే. వేదనాథుండు కలిమిని విద్యయందుఁ
బేరు వడసినవాఁడు తత్ప్రియసుతుండు
తండ్రిశిక్షను బెరిఁగినదానఁ గాంచె
శీలవిద్యల మణియుఁ బసిండిఁ బోలె. ౧౨౧

తే. మఱియుఁ బరమేశ్వరుఁడు మీకు మాన్యుఁ డతని
యగ్రసతుఁడు పరీక్షల నగ్రపదము
నొందె శుభ మగునడవడి యొప్పువాఁడు
నీ వెఱుంగుదు వేల వానిం దలఁపవు. ౧౨౨

తే. పరఁగుఁ బురుషోత్తముఁ డన నన్వర్థనామ
ధేయుఁడై మనోరమరూపధేయుఁ డగుచుఁ
గలిమి విద్యయు సొంపు పెం పలరువాఁడు
తనర మనమనోరమ కెన యని తలంతు. ౧౨౩

క. వీ రిద్దఱు నాంగ్లేయవ
చోరాఘిం గన్నవారు సుచరితులు శుభా

కారులును సుశీలకును మ
నోరమకుం దగుదు రంచు నూల్కొందు మదిన్. ౧౨౪

క. ఇప్పుడు తప్పినఁ బిదపన్
దప్పదనుచు నెట్లు తలఁపఁ దగు విఘ్నములన్
దప్పినవారిం జూచుచుఁ
దప్పేమీ యని పడుదు మధర్మమునందున్. ౧౨౫

క. ఎన్న నధర్మము ధర్మము
కన్నన్ సులభంబు సేఁత కష్టముచే న
భ్యున్నతకుడ్యము నెక్కుట
కన్నన్ జాఱుట సులభము గాదే తలఁపన్. ౧౨౬

చ. అనుటయు నన్న యిట్లను నయంబున నిప్పుడు నీ వుదాహ
రిం, చినవరు లిద్దఱుం దగినచిన్నెలఁ జెన్నెసలారువార త
జ్జనకులతోడ నీతలఁపు సంగతమూరఁగఁ బల్కి వారిచే
ననుమతిఁ జెందఁగా నగునుపాయముఁ బాయక యింకఁ
జూచెదన్. ౧౨౭

ఉ. నీ వొనరంగ నాడినది నిక్కము తక్కిన నిప్పు డొందుచో
లా వన రాదు సేయ సకలంబును నిట్టుల యుండు నెప్పు
డున్, గావఁగ ధర్మ వెన్న నదనం దగుఁ గావఁగ నట్లు
గానిచో, వావిరి నావిలంపఱిచి వైచును లోఁచి యధర్మ
మే ద్రైలన్. ౧౨౮

క. కమలోదరుఁడుం బురుషో
త్తముఁడును నీపలికినట్ల తగియెడువారల్

విమలగుణశీలయుక్తు ల
సమవిద్యులు నాదుమదికి సరిపడువారల్. ౧౨౯

క. వారిన్ జనకులు తగఁ దమ
సూరెల విడువంగ నీక సునిపుణమతులై
వారిచి చదివించుట స
చ్చారిత్రము విద్యపెంపు సమతం దనరెన్. ౧౩౦

క. అట్టిది లేకయ బాలురు
కట్టు విడిచి బొట్టు లేక కట్టా స్వేచ్ఛన్
గట్టున్ జుట్టుం దాల్తురు
నెట్టన యిది జనకు లట్టినెఱి దప్పునెడన్. ౧౩౧

క. అందునఁ బలికితి సుమతికిఁ
బొందుగఁ దగుతోడు ననిపి పుచ్చుఁగ వలయున్
మందత నటు సేయమ యేఁ
గుందన యగుఁ బిదప వానికుటిలచరితకున్. ౧౩౨

క. ఇది సాధారణ మగున
ట్టిదోషము సుదూర మైనఔంకికి సుతులన్
జదువునకుఁ బంపువారలు
పదిలముకా మదిఁ దలంప వలయును నియతిన్. ౧౩౩

క. ఐనన్ దినకరు ననుమతి
కై నయమున వ్రాయఁ దగు నకారణముగ నా
పై నధికం బగుకినుకన్
బూనినవాఁ డేమి బదులు పుచ్చునొ యెఱుఁగన్. ౧౩౪

ఉ. ఏమిటి కంటివేని విను మిద్దఱ మఱ్ఱిలిఁ గూడి యుండఁగా
గీమున కేగుదెంచెఁ బరకీయుఁడు లాఁతివిలాతిజాతి తోఁ
ప్రేముడి వానితోఁ దినియెఁ బెంపున భక్ష్యము లప్డు నన్
బిలన్, నామది యొల్ల దంటి నఁట నాపయిఁ బూనె దు
రంతకోపమున్. ౧౩౫

క. మూఢుఁడవు సరకు సేయవు.
గాఢమదోద్ధతుఁడ వని నికామక్రోధా
లీఢమనస్కుం డయి యని
గూఢముగా బిట్టు తిట్టెఁ గూరిమి దఱుఁగన్. ౧౩౬

క. అది మొదలు లాఁతఁడు నాతోఁ
గదియం జేరఁడు పలుకఁడు గారవ ముంపం
డది యెఱిఁగి తొఱఁగి యాతని
విదూరదేశంబు సేర వేగ దలఁచితిన్. ౧౩౭

తే. దినకరుం డిట్లు పలుక నదీన యగుచు
మానవతి యంత నుడివెను దీని కీవు
మది భయంపడ వలవదు మధుకరుండు
మొనసి యెట్లని దీని కీకొనక పోఁడు. ౧౩౮

క. మృదుభాషిణియుల్లం బతి
మృదుల మగుట నీదుకోర్కి మెయికొని యాతం
డు దయారహితుం డైనను
మృదువచనముల నది వాని మెత్తనపఱుచున్. ౧౩౯

తే. దానిమానసం బెఱుఁగుదు దాని కంత
పట్టుదల లేదు మగనిదుర్వాదమందుఁ
బ్రియుని మాటాడ నోడి వర్తించు చుండు
వానిమతమున దానును బరఁగునట్లు. ౧౪౦

ఆ. సోమయాజి యైనసోమనాథుతనూజ
దానిగుణము మున్ను గాన మేమి
దయితుమాట యింత దాఁటని దాటను
దానిచరిత యిట్లు కాని దయ్యో. ౧౪౧

ఆ. అంత దినకరుండు కాంతఁగోఁ దలపోసి
యదియె యుక్త మనుచు మదిఁ దలంచి
యన్నియు వివరించి యన్నకు నయమున
లేక వ్రాసె నప్పు డేకమతిని. ౧౪౨

క. అక్కడ మధుకరుఁ డెంతయు
నక్కజముగఁ గాంచి తమ్ముఁ డనిపిన లేఖ
వెక్కసమున మృదుభాషిణి
నొక్కెడ రాఁ బిలిచి దాని కుద్ధతిఁ బలికెఁ. ౧౪౩

సీ. ఇదె నీదుమఱఁది తా నిన్నాళ్ల కీజాబు
వ్రాసినాఁ డిది విను వానిబుద్ధి
బంధులఁ గలసి తాఁ బరఁగుచున్నాఁ డంట
వారిసమ్మతి తాను బడసె నంట
ధార్మికుఁ డెంతయుఁ దా నంట ధర్మైక
నిష్ఠతో దీని యత్నించె నంట

తనకుమారున కిప్డు తా నుపనయనంబు
చేయఁగా నవసర మాయె నంట
తనదుకూఁతునకును మఱి దానితోడఁ
దగ మనోరమకును బెండ్లి తాను జేయ
మెయికొనియె నంట నిఁక నీడు మీఱు నంట
చూఁడుబ్రాఁతలు వానివి చూడు మీవు. ౧౪౪

క. నాకొమరిత కితఁ డెవ్వఁడు
సాకత మఁట సేయఁ బెండ్లి జరిగింపంగాఁ
బోకలు మీఱినమాటలు
దేకుము నాయొద్ద కనుచుఁ దిట్టి పనిచినన్. ౧౪౫

క. నాపరువు గాన నోల్లం
జేపున వ్రాయంగఁ దొడఁగె హీనవిధమునన్
ద్రోపాడిన వెండియుఁ దాఁ
బ్రోపయి యేతెంచె మించి బుద్ధి కలపఁగన్. ౧౪౬

క. ధర్మంబు తా నెఱుఁగు నఁట
ధార్మికు లగువారిసమ్మతం బిది యఁట నా
మర్మములు సోఁక నాడెడు
నిర్మర్యాదుండు వీఁడు నీతిరహితుఁడున్. ౧౪౭

ఉ. వేదము పేరు పెట్టికొని పేదఱికంబునఁ బొట్టకోసమై
వీదులఁ బాఱుచుండుదురు వేమఱు సోమరు లైనయట్టి యం
బేదలు గాఢమూఢు లగువీరలబారికిఁ జిక్కి దుర్మదం
డాదినకృత్తు విత్త్వ మొలయన్ నుడు లాడెడు వేదబం
బునన్. ౧౪౮

శా. ఈలోకమ్మున నాకు నిమ్ము దగ నీ కిమ్మాఁ బరం బందు నా
నాలోచింపరు లోఁచునీనుడులు వేదార్థం బటన్నం దమో
లోలత్వంబున మగ్నులౌదురు కటా లోకుల్ స్వదృక్పాత్ర
మా, నీలోకంబుఁ ద్యజింప నేమిటికి వేఱేలోకముం గల్గునే.

చ. తలఁప నదృష్టమై తనరు ధర్మ మధర్మము వీనికై యిహం
బల యవివేకి దృష్టము ప్రయాసమునంబడి కోలుపోవు దు
ర్గలితపుటీవిధి న్నిజకులంబును మోసము పోయి మోసపు
త్రిల నటునంటివారు గల రేమి యనంగ విమూఢు లంగనా.

క. తలజుట్టున నెఱబొట్టున
మొలకట్టున ధర్మమేమి పూని నిలుచునే
యిల భోగములం బాసిన
నలయోగము లేమి పొంద నగునే చెపుమా. ౧౫౧

ఉ. బూది యలందినం బరమపుణ్యము సేకుఱు నంట నద్విజా
తాదులు సూడఁగాఁ దివఁగ నర్హము గాదఁట యింక వారి
కిన్, మై దగులం గరంబు మలినం బగునంట మఱొంట
వారిచే, నేదియుఁ దిన్నయాతఁడు నిహీనత నొందెడునంట
వింటివే. ౧౫౨

ఉ. వైదికులంట యింటఁ గుడువన్ దొడువ న్నటి కట్ట లేక పెం
పేది గృహస్థులం దఱిసి పీడన సేయుదు రాత్మవృత్తికై
కా దన కాదటం దమమొగంబున వేసరి వేసినన్ గ్రహిం
త్రాదృతి వీఁడు వారివశ మయ్యెను దయ్యము నెత్తికోలు
నన్. ౧౫3

ఉ. పోఁడిమి నేర రేమి చదువుం జదువ న్మఱి నాగరత్వపుం
బాడి యెఱుంగ రింత గరిమం దరముం గనుతీరు లేద యీ
వేడబ మీవిడంబనము వెక్కస మయ్యెడు నొక్కరీతి నీ
బూడిద వేఁతమూతులకు ముద్దుకొమార్త నొసంగ నేతునే.

క. పూర్వాచారపరుం డను
గర్వము తలకెక్కి ద్రొక్కి కార్పణ్యమునన్
బర్వ గణింపక మదికిన్
దుర్వహముగ నాడఁ బాఱి నూకం దగదే. ౧౫౫

క. అని యీవిధమున మధుకరుఁ
డనయము వైదికులసరణియందును ననుజ
న్మునియందును నుడికిల్లెడు
ఘనకోపమున మన మెఱియఁగాఁ బలుకంగన్. ౧౫౬

క. విని వల్లభ మృదుభాషిణి
వినయంబున హృదయదయితువీనులకు మనం
బునకుం జినుకుచు నమృతముఁ
దనరు న్మృదుమధురసుభాషితంబులఁ బలికెన్. ౧౫౭

క. ప్రాణేశ యీవిధమున స
మానోదర్యునెడఁ బ్రేమ మానఁగ నగునే
మానం బొసఁగు స్వజన మవ
మానము గావించె ననుట మఱవుము నాథా. ౧౫౮

క. సోదరుకన్నను బంధుం
డాదటకుం జోటు గలఁడె యన్యుం డెన్నన్

వాడుఁ ద్యజించి భజింపుఁడు
సాదుతనం బొంది పొందుసౌఖ్యం బనఘా. ౧౫౯

క. ఒకమరి యకారణముగా
వికటంబై సంభవించె విధివశమునఁ జే
సి కలంకం బది స్నేహా
దకములఁ దగఁ గడిగి భ్రాతృధర్మము గనుఁడీ. ౧౬౦

చ. తురకవజీరుతోఁ గలసి తోడయి కూడి భుజింపఁ బిల్వఁ దే
వరుఁడు తినంగ నొల్ల నని పల్కెను గాక యిదేమి దీనికై
విరసతఁ గోపగించితిరి విన్నఁదనం బతఁ డొంది కుంది మం
దిర మిట వేఱు సేరుటకు నేరక దేశము వీడె నొక్కటే.

క. మీతాతలయాచారము
మీతమ్ముం డాచరించు మే లది గాదే
పూతాచారపరుం డను
ఖ్యాతియు మీవంశమునకు ఘన మగుఁ గాదే. ౧౬౨

క. సహవాసవశమ్మున మీ
కు హితంబై తోఁచెడు నిది క్రొత్తపథం బిం
దు హితాహితములు వెరవున
మహి మనకుం గలుపునట్టిమహితుం గానన్. ౧౬౩

క. పరలోకం బున్నది యని
యరయంగా నేర దేని నది లే దని యె
ట్లరయం దర మగు మది నొ
ప్పరికింపక యురవు వెరవు పరికింపు తగన్. ౧౬౪

క. ఉన్న దనియు లే దనియును
గన్నులకుం గాన దేనిఁ గానక దానిన్
సన్నుత లే దనఁ బాడియె
యున్న దనుచు నేఁ దలంతు నుల్లమునందున్. ౧౬౫

క. ఉన్నంతయుఁ గాంచినవా
రున్నా రే పుడమియందు నరవే యవి లే
వన్నన్ గావునఁ దగవున
నున్న దనియె యిచ్చ నచ్చు టుచితం బనఘా. ౧౬౬

క. ఇది ధర్మ మధర్మం బని
విదితము గా కున్న మున్న విహితం బగు చు
న్నదియే ధర్మం బని నా
హృదయేశ దలంప రాదె హృదయమునందున్. ౧౬౭

క. ఆత్మీయ వారిఁ బోనిం
డీత్మీవన్ మీరు పొందు హిత మిర్వురకున్
గోత్రాలంకారంబుగ
మైత్రతఁ గనుఁ డిదియె తేజ మనుగడ కెల్లన్. ౧౬౮

క. ఏనన్ నామది యిప్పుడు
గానం బలికెదను గినుక గదురక వినుఁడీ
మానితు లగుమనపూర్వుల
యానడవడి చూడఁగాఁ బ్రియం బగు నాకున్. ౧౬౯

క. మొదలన్ సదముల మీాత్రో
ముదిత నయితిఁ దిరుగఁ గాంచి ముదిత నగుటచేఁ

బదపడి మది కప్పియన్నియు
ముద మియ్యవు నీదుతియ్యముదలను దక్కన్. ౧౭౦

క. బూది నలందిన వెక్కస
మే దానం గలుగుశోభ యే మనుదానన్
వేదుఱు పట్టినవిధమున
నాదలు పడినట్లు దోఁచు నది లే కున్నన్. ౧౭౧

క. మొగమునకుఁ దగుతిలక మొగి
వగ మీఱఁగఁ దాల్పనట్టివారి మొగంబుల్
మొగులు నెల నావరించిన
గగనముగతిఁ జెన్ను దఱఁగి గానఁగ వచ్చున్. ౧౭౨

క. మును మీరు వదనకమలం
బున భూతియుఁ జందనంబుఁ బొలుపార ధరిం
చిననాఁటిమీశుభాకృతి
మనమున కిడు ముదము దలఁప మానుగ నాకున్. ౧౭౩

క. నిర్మల మగుమనమున స
త్కర్మం బెది యంచు నెంచుతఱి ముందట మీ
శర్మదభసితోల్లసితము
భర్మాబ్జనిభంబు ముఖము భాసిల్లు మదిన్. ౧౭౪

క. కానన్ మెచ్చుగ నచ్చిన
దానన్ మనపూర్వబుధులదారియె మే లం
చానంద మొందు డెందము
దానిన్ ధ్యానింప సంపద లివి సతంబే. ౧౭౫

క. మనపుత్త్రిలు పుత్త్రికలుఁ
ఘన మగువిద్యయును గలిమి గన్నారైనఁ
వినుతచరితంబు లేమిఁ
గనవత్తురు మలినదర్పణముల విధమునఁ. ౧౭౬

క. కోపము నొందకు నామది
తాపము వీడంగ నాడెదను విను నాథా
పీఁపుదరిఁ బలుకువారల
వాపోకల నాఁప నెవరివశ మగుఁ జెప్పుమా. ౧౭౭

క. బందుగులపొందు డిందిన
చందంబై తోఁచు నెంతచనవునఁ బిలువఁ
మందిరమువంక నేతే
రందులకుం గారణంబు నారయుఁడు మఱిఁ. ౧౭౮

క. పరిపరివిధముల మిత్త్రిలు
పరిచితులుం బొరుగువారు ప్రశ్నలు సేయఁ
వెరవేది మాఱు వలుకఁ
గరువం బఱి యున్న నన్నుఁ గానవు కాంతా. ౧౭౯

క. మనవారియొప్పు సెప్పెద
వినుమా కను మూసి యుందు వేసరి సరివా
రినడుమ నిడుమం బడునా
ఘనువు కనవు వారికతనఁ బ్రాణాధీశా. ౧౮౦

క. నామాట వినదు కమలయు
నామార్గమె పట్టు విమల యన్యోన్యకృత

ప్రేమానుబంధ లగుచున్
దా మొక్కటిగాఁ జరింత్రు తమయిచ్చమెయిన్. ౧౮౧

క. ఇచ్చను దిరిగిన నే మని
యిచ్చను దలఁపంగ వచ్చునే కన్యలఁ బో
నిచ్చిన నటు విచ్చలవిడిఁ
గ్రచ్చఱ ఱొచ్చులకుఁ బాలు గారే నాథా. ౧౮౨

క. అనువునఁ బెండిలి సేయుద
మని కని యేఁ బేరుకొన్న యందఱకందుల్
తనమనమునఁ దోఁచెడునవి
యొనరంగాఁ బలికి కమల యొల్ల నను వెసన్. ౧౮౩

క. ఒకపరి పరాంకుశయ్యను
నొకపరి బ్రహ్మాండరావు నొక్కమరి వినా
యకపంతుల నొకమరి తాఁ
బ్రకటముగా బసవరాజు వరియింతు ననున్. ౧౮౪

క. విమల తెలుఁగు నట్టిద యిఁకఁ
గొమరులమురు వాలకింపు కులనియతి యఱన్
గ్రమ మేది సంచరించెద
రమందతచ్ఛందవశవిహారరసికు లై. ౧౮౫

క. మీ రింతయుఁ బరికింప ర
పారవ్యాపారవారపారీణుల రై
వారక కారించెదునా
యే రిది వారింప నోపరే హృదయేశా. ౧౮౬

క. సంపదలఁ బొదలఁ జేసితి
రింపు దనర నిడితి రిష్టమృష్టాన్నంబుల్
పెంపునఁ దొడి కట్ట నిడితి
రంపఱ యిది గ్రువ్వ నొవ్వ హారియింప రాకో. ౧౮౭

క. నామనవి యొకటి వినుమా
ప్రేముడి నీవర మొసంగి కృప నేలుమ యం
చాముద్దియ తద్దయు బా
ష్పామలబిందువుల దయితునంఘ్రులఁ దడిపెఁ. ౧౮౮

ఆ. అంత మధుకరుండు సంతప్తచిత్తుఁడై
హృదయదయితశోక మెద సహింపఁ
జాల కబల నెత్తి లాలించి యిట్లనుఁ
గన్నుదోయి నశ్రుకణము లొలుక. ౧౮౯

క. నీమదికి నింపు గానిది
నామది కింపే సరోజనయనా యిఁక నీ
కేమి ప్రియంబో చెపుమా
యేమఱ కయ్యది యొనర్తు నిప్పుడ యెలమిఁ. ౧౯౦

క. నీదుమది నాకుఁ దెలియం
గా దయ్యెను దెలిసినేనిఁ గార్యము సర్వం
బాదట నీకుం గూర్చిన
యాదారిం జేసి యుందు నిందునిభాస్యా. ౧౯౧

క. నాతోడ వీడ నాడక
యాతోరపువ్యసనభరము నెటు సైఁచితివో

నీతిఁ నీచేసినయీ
భ్రాంతికి నే నేమి మాఱు రచియింతు నిలఁ. ౧౯౨

క. ఏఁకటఁ బెద్దయుఁ గాలము
నీకుం గానివి యి వెల్ల నెఱి సైఁచుటచే
నీకూరిమి దెలిపితి గా
నాకూరిమి యెఱుఁగ వైతి నళినదళాక్షీ. ౧౯౩

క. నాయీనూతనమార్గము
నీయెదకుం గా దటంచు నే నెఱిఁగితి నేఁ
యెల యాఁకుణం బే
పాయుదుఁ గాదే య దేమి పరమార్థం బే. ౧౯౪

క. ఇపు డేమి చెడెను గార్యము
చెపుమా నీకోర్కె నాకుఁ జెచ్చెర వీడఁ
నిపుణముగా సవరించెద
విపరీతము గాదు నీదుప్రియుపలుకు చెలీ. ౧౯౫

క. సుతులకు నుపనయనంబులు
సుతలకుఁ బరిణయములు బడి చొప్పడ నవిలం
బితముగ జరిగించెద నెద
వితాకుఁ బొందంగ నేల వితగా ముదితా. ౧౯౬

క. అన్నియు నడపెద నీకను
సన్నన యుపభుక్తమైనస్రజమును బోలెఁ
విన్నందనమును విడుమా
సన్నుతిఁ గనుమా పవిత్రచరితలలోనఁ. ౧౯౭

క. అని యక్కునఁ జేర్చి సతి
కనుఁగవ నొత్తుచు నిజాంశుకంబున నెయ్యం
బున పేర్చి దేహ మదె యై
న నవీకృతుఁ డయ్యెఁ దాను నవగుణములచేన్. ౧౯౮

క. కన వలయుఁ గాని స్నేహం
బన నలవియె యిట్టి దనుచు నంత మధుకరుం
డును గరఁగి కాంతవగపున
ననలంబునఁ బసిఁడివోలె నమలుం డయ్యెన్. ౧౯౯

క. అంతఃకరణతరంగము
లంతంతన్ శాంతి నొంద నంత మధుకరుం
డింతిఁ గనుంగొని చింతా
దంతురితలలాటుఁ డగుచుఁ దా నిట్లనియెన్. ౨౦౦

క. నీ నొడివినయది నిక్కము
నానయనము లిపుడు విచ్చె నలినాక్షి వగం
బోనిడి యెడకుం బ్రియముగ
నానతిమ్మిఁక యొనర్ప నగు కార్యములన్. ౨౦౧

క. పెనుసభల నభీరు వగుచు
మును జనములు విన నవాబ్దముక్తామలధా
రను బోలువాగ్విలాసం
బున వినుతిం గన్నయన్న వొందెను బ్రకృతిన్. ౨౦౨

క. సామాన్యపుసతికైవడి
నామాన్య నిజస్వభావ మంది యమంద

ప్రేమయు లజ్జయుఁ బెనఁగొన
నామధుకరుపలుకు వినియె నతియత్నమునన్. ౨౦౩

క. ప్రకృతిమధురం బగుగుణాం
బొకట విడిచి యొడలు దెలియ కుండెడువారల్
సుకృతాభివృద్ధశోకం
బుకతన నిజ మగుగుణంబు వొందుదురు ధరన్. ౨౦౪

చ. అని పతి పల్కిన న్వొలఁది యాతనియంకతలంబునుండి యొ
య్యనఁ దొలఁగంగజాఱి దయితాననమందు నవార్ద్రిపద్మ
శో, భన మగుచూడ్కి సొంపు లొదవన్ బరఁగించుచు
నూర్పు వుచ్చి యి, ట్లనియె మరందసారహరణాతివిదగ్ధము
లైనసూక్తులన్. ౨౦౫

క. మీ కానతియ్య నయ్యా
నాకర్హమె కరుణఁ జూపినారలు నాపైఁ
బై కొనుట తగునె నాతికిఁ
గై కొనుఁ డిది వేఁడికోలు గాఁగ హృదీశా. ౨౦౬

క. మనము పెడత్రోవఁ బడితిమి
దినకరుయత్నమును మీరు ద్రిప్పఁగనేలా
ఘనత మది ననుమతింపుఁడు
మనోరమకు నతఁడు పెండ్లి మసలక చేయన్. ౨౦౭

క. నాచిన్నికూఁతునకు వే
ఱేచింతయు విడి వివాహ మొనయింపుఁడు త
ద్వాచికము కమ్మ తమ్మున
కై చేర్పుఁడు కరుణతోడ గ్రమ్మన నాథా. ౨౦౮

క. మనపెద్దకూఁతుల కిపుడు
తనర వివాహంబు సేయఁ దరమో కాదో
యొనరఁగఁ గడంగిన విలం
బన మగుఁ గావున మనోరమకు వెస నగుతన్. ౨౦౯

క. మనయింటిదీపిక యనా
మనోరమను దలఁచుచుందు మానక యెపుడున్
దినకరునిచ్చను దానికి
నొనరింపుఁడు పేర్మి నిపుడ యుద్వాహంబున్. ౨౧౦

క. చిన్నది కూరిమి సుఖముం
గన్నది దుఃఖంబు నొందఁ గానిది మిగులన్
జిన్నారిగుణము గల యది
విన్నంబఱుపకుఁడు దానిఁ బెండిలి లేమిన్. ౨౧౧

క. మానవతికిఁ గూర్చి యెంతయు
మానుగ నాయమ్మతోడ మాలిమి యై య
న్యూన మగుసుశీలనెయ్యము
లోనై తా నందుఁ బ్రమదలోలత నుండున్. ౨౧౨

క. కానన్ సుశీలతోడుత
దానికి దినకరుఁడు పెండ్లి దలఁచెను జేయన్
మానవతికోర్కె యట్టుల
యానతి యొసఁగుండు మీర లాపనికి దయన్. ౨౧౩

క. పురుషోత్తముండు గుణములఁ
బురుషోత్తముతోన పురుడు పుడమి వరులయం

దరయంబడులక్షణములు
సరి యెల్లఁ వాసియందు సరసత వెలయున్. ౨౧౪

క. కమలోదరునకుఁ బురుషో
త్తమునకు సరి యైనవరులు ధరణిం గలరే
యమితానందము నొందితి
నమరఁగ మనకట్టిసుగుణు లరిది లభింపన్. ౨౧౫

క. అనుసతితియ్యనినుడువులఁ
దనమన మపగతవిమోహతను నిర్మలమై
తనరఁగ మధుకరుఁ డప్పుడు
తనతమ్మునకుఁ బ్రతిలేఖఁ దగఁ బంపె వెసన్. ౨౧౬

క. అందున్ దినకరు నధికా
నందముతో ననునయించి నందనకు నతం
డందముగాఁ బరిణయమున్
బొందుగఁ జేయంగఁ దనదుపొందుం దెలిపెన్. ౨౧౭

క. వెండియుఁ బలికె మనోరమ
పెండిలి దిర మగుచుఁ గుదిరెఁ బెదకూఁతులకున్
మొం డొడ్డ నీక యేఁకట
మెం దగుయత్నంబు సేయ మే లగుఁ గాదే. ౨౧౮

క. అంతటఁ దగుయత్నముచే
మంతన మెంతయును జేసి మనువులను విచా
రింతము వెదకింతము గా
వింతము కమలకు విమలకుఁ బెండిలి యొప్పన్. ౨౧౯

క. ముందుగ నుపనయనంబుల
నందనులకు నంద మమర నందితబుధస
త్సందోహంబుగఁ జేసెదఁ
గుందరదన యిపుడు నీదుకూరిమికిఁ దగన్. ౨౨౦

చ. అనుచుఁ బురోహితుణ్ హితు ద్విజాగ్రసరుణ్ వెసఁ దోడు
తేరఁగన్, బనిచి యతండు వచ్చినయనంతర మర్థి నిజేష్ట
మాతనిన్, దనరఁగఁ జెప్ప నాతఁడు ముదంబున లగ్నము
సౌమ్యవీక్షితం, బును దగ నిర్ణయించె బహుమోదము
నొందఁగ నెల్లవారలున్. ౨౨౧

ఉ. లగ్నము నిర్ణయించి హితలాలసుఁడై ద్విజవర్యుఁ డిట్లనున్
భగ్నము గాక యుండ నిజవంశ మొనర్చితి వింక ధర్మవృ
భుగ్నము గాక కూఁతులకుఁ బోలెడుభర్తలఁ గూర్చి పంపి
యు, ద్విగ్నత లేక యుండు మని విన్నను వొప్పఁగ విన్న
వించినన్. ౨౨౨

చ. మధుకరుఁ డంతఁ జింత యభిమానము దైన్యము సంద
డింపఁగా, విధుతమనస్కుఁడై యపుడు విప్రవరుం గని
పల్కె మన్ననన్, బుధవర యీవు సత్కరుణఁ బూని
శుభం బిది సంఘటింపు నీ, కు ధనము నెంత కావలయుఁ
గొ మ్మది నెమ్మది నిత్తు నావుడున్. ౨౨3

క. పండితుఁ డందుల కిట్లనె
ఖండితముగ నాపని యిది గా దయ్యా యీ
మండలమునఁ గాదు నరుల
దండిగ ధన మిచ్చి వలయు దవులకుఁ బనుపన్. ౨౨౪

క. నయశీలురు ధీమంతులు
నయి యొప్పెడునట్టివారి నమరుతు నీకున్
రయమునఁ దగఁ బనిగొనుమా
మయిమయి వారలను నప్రమాదంబుమెయిన్. ౧౧౫

మ. అని యాపండితసత్తముండు తనకార్యం బట్లు తత్కార్య
సా, ధననైపుణ్యము గల్గునల్లురను దత్సాన్నిధ్యముం జేర్ప
నా, యనయున్ సమ్మతి వారలం గొనియె సద్యఃప్రీతుఁడై
యాబుధుం, డు నిజేచ్ఛం జనె నంత నామధుకరుండున్
వారితోఁ ని ట్లనున్. ౧౧౬

క. నాకొమరిత లిద్దఱును శు
భాకృతి రతికిన్ సువిద్య నాభారతికిన్
వాకొన నొప్పుదు రెన యని
యాకల్యాణులకు వలయుఁ గల్యాణంబుల్. ౧౧౭

చ. అదనున విద్యపెల్లొదవ నాంగ్లకలాలయమందుఁ జేరి త
త్సదతులతోడ వీడక సుదూరము సాంతము పెంపుమైఁ
దగన్, జదువుటచే నొకర్తకు జనంబులు పెండ్లికి నీడు
మీఱె నం, చదయుతఁ బల్కసాగి రనుదారమనస్కతఁ
బొందు లేవడిన్. ౧౧౮

క. దానికిఁ దగువరు నిపు డెం
దేనిన్ వెదకంగవలయు దీనికి మిమ్మున్
బూనఁగ వేఁడెదఁ గొండొక
దానికి నేమియు నుడువరు తప్పు జనంబుల్. ౧౧౯

క. తగుపాఠశాలలందున్
సుగుణుల విద్యావిచక్షణులను నిపుణులన్
మొగి మీరు చని విచారిం
పఁగవలయును దాని కెంత పట్టును జెపుఁడీ. ౧౩౦

తే. ఎంత వలసిన నిచ్చెద సంతసమున
మీకు సెలవుల కనుచు నమ్మేటి నుడువ
వార లొండొరుముఖములఁ దారు గాంచి
మధుకరునితోడ నీగతిం బలికి రపుడు. ౧౩౧

శా. ఈదేశంబునఁ జిక్కఁడేని వరుఁ డింకేదేశమే నేగి మీ
యాదేశం బొనరింపఁ గాఁగలము మీయర్థంబు సిద్ధం బిటన్
మోదం బొంది చరింపుఁ డీరు సకలంబున్ మేము సాధింతు
మం, చాదూత్యజ్ఞులు పల్కఁగా మధుకరుం డత్యంతసం
తుష్టుఁడై. ౧౩౨

తే. వారలకు వేయిరూప్యముల్ వ్యయమున కయి
యిచ్చెఁ దాఁ జెటీ యిన్నూటయేఁబదిగను
వేగ సాధింత్రు తనపనిఁ బ్రీతి ననుచు
నక్కఱకు నెక్కుడై తగ నప్పు డతఁడు. ౧౩౩

ఆ. వారు వీడుకోలు వడసి పోయినయంతఁ
గమలఁ బిలువఁ బంచి కాంతఁ గూడి
తగ వివాహవార్తఁ దడవుచు దానితో
నిట్లు పలికె మనము నెఱుఁగుపొంచె. ౧౩౪

ఆ. చదువుఁ జదివి తెంత చదువఁగ వచ్చునో
నెలఁత యంత యింక నెలమి మిగుల
నీదుమదికిఁ గూర్చునిపుణుఁ డౌవరుని వ
రించి పెండ్లియాడి మించి మనుము. ౨౩౫

క. నీతియు విద్యయుఁ గలవాఁ
డై తగి నీమనము నొంది యలరెడువానిన్
గాతర్యము లేక నుడువు
నీతలిదండ్రులకు నిపుడు నీమది తెలఁగన్. ౨౩౬

ఆ. ఏన కాంచి తగినవానికి ని న్నియ్య
వలసి యుండె నదియ కులముపాడి
చదువుపెరిమమీఁదఁ గదురుమోహంబునఁ
గన్న గాన నైతి నన్నుమిన్న. ౨౩౭

ఉ. పిన్నటనాఁడు వేదవిధిఁ బెం పెసలారఁగ నీడునం దగన్
నిన్ను నలంకృతాంగి వటునేతకు నియ్యఁగ నోఁచ నైతి సం
పన్నత గల్గి యీవిధము బంధుసమాజమునందు గర్హణన్
విన్నదనంబు నొందితి వివేకవిహీనత విన్ము పుత్రికా.

క. నీపిన్నతండ్రి యొంతయు
నేపున నుద్వాహములను హేరాళముగా
నీపినచెల్లెండ్రకుఁ దగ
దాపున సమకట్టెఁ జేయఁ దామరసాక్షీ. ౨౩౮

క. ఒకవైపున సమ్మోదము
నొకవైపున శోకవేగ ముత్తలపడుచున్

సుకుమారి మనోరమ కగు
నకలంకతఁ బెండ్లి నీకు నటు గా దనుచున్. ౨౮౦

క. నవసంపదలం దెలియక
యువగాముల మనమునందు నరయనివారల్
భువిఁ బడు నుదర్కశోకముఁ
దవ నొందితి నిపుడు నేను దరిఁ గానఁ గటా. ౨౮౧

ఉ. ఎంతధనంబు నేని మది కింపు జనింప నొసంగి విద్యయం
దంతట మెచ్చు గాంచిన ద్విజాన్వయదీపుఁడు బ్రహ్మచారికిన్
సంతస మార మిత్త్రతతి సారెకు సన్నుతి సేయఁ బాయ కి
య్యంతియు హర్ష మొంద నిను నిత్తు వివాహమునందు నందనా. ౨౮౨

తే. బాలురును బాలికలుఁ దారు స్వహిత మరయఁ
దమకుఁ దగ దండ్రు పెద్దలు తద్విధంబు
గాక తప్పిన నుభయలోకజసుఖములు
గోలుపోవుదు రిదియు నిక్కువము సువ్వె. ౨౮౩

చ. అదియునుఁ గాక యౌవనము నంకురమొందఁగ నట్టివారి
కు, స్వదముఖబుద్ధి నిల్వదు సమాహితభావముచే హితం
బునన్, మది కలఁగంగఁ బాఱి తదనంతరసౌఖ్యమె వేఁడుఁ
గాని తా, నదరు దొలంగి దీర్ఘపుటుదర్కసుఖం బది
వార్వ నేర్చునే. ౨౮౪

ఉ. కావున నీవు నీకుఁ దగుకాంతుఁ దనంత వరింప మేలు గా
దేవిధనైన నీహితము నేన దలంచి లసద్గుణోత్తరున్

భావమునందు నీకుఁ దగువాని నమర్చెద నిప్పు డేను నీ
కీవిషయంబు సక్కమది కెక్క వచింపఁగ నిన్నుఁ బిల్చితిన్.

క. కితవు లనేకులు గల రా
వితమారయ నీకుఁ గాదు వెరవిఁడివై వా
రితగుల మొందిన నిత్యం
బు తుదిన్ గదుఁ బొక్కిపొక్కి పొగులంగ నగున్. ౨౮౬

క. పెక్కురుపడుచులు పలువల
యుక్కివమున లోఁగి బాగు నొందక సరివా
రక్కజముగ నవ్వఁ గదున్
బొక్కెడివా రేతదన్యభూముల వినవే. ౨౮౭

క. వైభవమునఁ దోడి కట్టం
బ్రాభవమున మెలఁగ నీ సమానలలో మె
చ్చై భూతి మెఱయఁ దపనీ
యాభరణాచ్ఛాదవాహనార్థము లిడితిన్. ౨౮౮

క. నీ వెప్పుడు నాపలుకున
కావంతయు మాఱు పలుక వాదట నేనున్
నోవు గలిగించునొకపలు
కేవేళ న్నిన్నుఁ బలికి యెఱుఁగను దల్లీ. ౨౮౯

క. మీయమ్మ మిమ్ముఁ గూరిచి
పాయక శోకించెడు నవివాహిత లగు మీ
యీయౌవనాంకురవిలా
సాయతసాయకము గ్రువ్వ నడలెడుఁ గంటే. ౨౯౦

క. వైలంబ మంగళం బగు
వేలను మీకున్ వివాహవిధి నడుపంగన్
జాలన్ వేఁడుచు నున్నది
యాలం బిఁకఁ గాదు సేయ నంబుజనయనా. ౨౫౧

క. ఏమఱితి నిన్నినాళ్లుం
బామరున ట్లింక నీవు వరుఁ బడసి సదృ
గ్వ్యామాత్ములలో నెంతయు
సోమానన మేలుబంతిసొబగుం గనుమా. ౨౫౨

క. అని యనునయవచనంబుల
జనకుఁడు పలికినను గమల జాతస్ఫురితో
ష్ఠనవప్రవాల యగుచున్
గనదీషద్రక్తిమంబు కనుఁగవ నొప్పన్. ౨౫3

క. ఇనసముదయభాసురకో
కనదాభంబై ముఖంబు కాంతిఁ దలిర్పన్
జననీకటాక్షకువలయ
జనితంబై సుస్మితేందుచంద్రిక యెసఁగన్. ౨౫౪

క. తనయిచ్చఁ బోవనీయఁడు
జనకుం డని కదురుకినుక జనని గని యడం
పను వెల్వడ లో నిముడం
గను నేరక మగువ మనము గారించెఁ గడున్. ౨౫౫

క. అంతఁ గనుదోయి నశ్రులు
పంతతముగఁ బఱవఁ దెఱవ జనకునిఁ బలికెన్

గాంతకుఁ గోపము చెడినన్
వంతయు రోదనము గాక వ మ్మాయి చనునే. ౨౫౬

క. ఏ నేమి తప్పు సేసితి
మానక తప్పులనె చెప్పు మాయమ్మ నను న్
గానఁగఁ జాలర యేనిన్
బ్రాణము హరియింపుఁ డిపుడ యాలం బేలా. ౨౫౭

క. సరివారిలోన నెంతయు
నరుదారఁగ గారవంబు నందుచు నున్నన్
బెరవా రందఱుఁ గర మా
దరబుద్ధిం గనుఁగొనంగఁ దనరుచు నున్నన్. ౨౫౮

క. కన్నమ్మకు విస మైతిన్
గన్నయ్యకుఁ గానిదానఁ గానం బోలెన్
జిన్నతనంబున గృహమున
నున్నయునికికన్న మృతియు నుర వగుఁ గాదే. ౨౫౯

క. నాతోడునీడమై తగు
నాతొయ్యలి మేరి నెట్టు లనురాగముతో
నాతలిదండ్రులు చూతురొ
యాతన్వికిఁ దేనఁ గడమ నగుదుం జెపుఁడీ. ౨౬౦

క. బేలని నీతులు గఱపఁగఁ
బోలదె నాబుద్ధిచొప్పుపోకడ నాకున్
జాలనికొదువకు విద్యా
శాలిని నై యుంటి వయసు చాలఁగఁ గంటిన్. ౨౬౧

చ. ఉవిదలు లేరె వారిపయి నూఱటఁ జూపరె తల్లిదండ్రులున్
సవతినిబోలె నెం దయిన నందన నేఁచునె తల్లి తండ్రి నా
సవతు నొకర్తుఁ జూతుఁ దల సమ్మతిఁ దాల్చెద రెందుఁ బో
యినఁగ, భవనము కంటకావృతము నాకును గేతకికిన్
వసుంధరన్. ౨౬౨

మ. అని మాఱొడ్డి వచించుచుండ జనకుం డత్యంతకోపార్తుఁడై
తనయా నిల్పుము నీయనర్గలవచోధారావిలాసంబు చా
లును మాకోర్కె ఫలించె దుర్మదతకున్ లోనైతి వేమందు
ని, న్ననసేలా యిఁక మాకుఁ బోలినటు చేయం బూనుటే
మే లిటన్. ౨౬౩

చ. అని కమలం జనం బనిచి యాలిఁ గనుంగొని యార్తుఁ డౌచు
మా, యనునయవాక్యముల్ వృథ వరానయనార్థము
పోయినారు వ, చ్చినయటమీఁదఁ గార్యగతి చింతన చే
యుద మంచుఁ బల్కె నె, మ్మనమున నిశ్చయించె నటు
మానిని దాను యథోచితంబుగాన్. ౨౬౪

ఉ. ఏకతమందుఁ జేరి యతఁ డేకత మందఁగ నేరఁ డయ్యె న
స్తోకమనీషుఁ డయ్యు నృపతుల్యమహాప్రభువంద్యుఁ డయ్యు
న, య్యాకులపాటుపెల్లిదము నార్పఁగఁ దీర్పరిఁ గాన కెంత
యున్, దేఁకువ లేక మగ్నుఁ డయి దెప్పర మైనవిచార
నీరధిన్. ౨౬౫

మ. ధర నాంగ్లప్రవరుల్ మహాత్ములు నుదృత్సంపదున్నేషు
లౌ, పరులున్ బెక్కురు నాకుఁ గూర్మి చెలులై వాంఛిం

ప్రియు నాప్రీతి యీ, విరసాలాప పరాభవించె నను నిర్వేతిం
డిశై యేను దు, ర్భరతాపంబును బొందఁగా వలసె దైవం
బిట్లుఁ జేయుం గదే. ౧౬౬

ఉ. సంపద లున్న నేమి మఱి సంగడివారలు నున్న నేమి సై
రింప నశక్య మైన యిది ప్రేంపఁగ నామదికిం బ్రియంబు గా
వింప వలంతు లేరు మును పెద్దల నాదరభావ మేది యా
లింపని నాదుదోస మిది లిబ్బుల లాఁతులచేతఁ బోవునే.

ఉ. మానవతిన్ సతిన్ దురభిమానముతోఁ బరుషంబు లాడి
తిన్, దానిహితోక్తు లే నపుడు తాలిమితో విని యుందు
నేని యీ, దీనత యీపరాభవము తీవ్రత నా కిటు సోఁక
కుండుఁ గా, దానియెడన్ సమాదరము తమ్ముఁడు చేసె
సుఖంబు నొందెడున్. ౧౬౭

ఉ. యౌవనసంభృతం బయినయర్థమదంబున బంధుకోటి సం
భావన సేయ నైతి నిట వారలసాయము కోలుపోయితిన్
వేవుర కైన నొడ్లకుఁ బ్రవేశమె కల్గదు కార్యవీథి నే
నేవిధిచేఁ దరింతు నిఁక నీసుదురాసదశోకవారిధిన్. ౧౬౮

ఉ. పావను లైనవృద్ధులను వాకిలిఁ జేరఁగ నీక త్రోచితిన్
గావునఁ గీడుమేళులను నా కెవరుం గఱవంగ లేర యీ
త్రోవ శుభంబు గా దనుచు రోయఁగఁ జాలక బేల నైతి న
న్నీవిషయమ్మునందు నిఁక నెవ్వరు తేర్చెడువారొ దైవమా.

శా. నాకంటెం గనఁ బ్రాణవల్లభకు విన్నాణంబుగా సర్వమున్
సాకల్యంబున వేద్య మయ్యె నది విజ్ఞానాకరంబై తగున్

నాకుం దెల్పె సమస్త మీగతికి విన్నంబాటు వొందెఁ గటా
యీకల్యాణనిధాన మేవలయుఁ గార్యంబున్ సమర్థింపఁగన్.

సీ. అన్నప్రదానాలయములందు వివిధజా
తుల కన్న మిడ రూప్యములును వేయి
వైద్యశాలలకును భైషజ్యములు గొన
వేయిరూప్యంబులు విశదముగను
బుస్తకాలయములఁ బుస్తకక్రయణార్థ
మొక వేయిరూప్యముల్ ప్రకటనియతి
జంతుసంరక్షణసంఘంబువారికి
రూప్యసహస్రంబు రూఢముగను
నిట్లు ప్రతివత్సరంబును నిచ్చుచున్న
నాకు నిట్టియిక్కట్టున నయముతోడ
సాయపడువాఁడు కనఁబడఁ డాయెఁ గాదె
వట్టిచందాలు గొన వచ్చువారె గాక. ౨౭౨

ఆ. మాపురోహితుండు మాన్యుఁడై తోఁచెడు
నతఁడు ధనముమీఁద నాస గొనని
యట్టివిధము గంటి నతనితోఁ గార్యంబు
గతిని గూర్చి వగతుఁ గాక యింక. ౨౭౩

ఆ. తనకుఁ దాన యిట్లు తలపోసి యూఱడి
మదిని గొంతవడికి మధుకరుండు
తన్నుఁ గాన వేచి యున్నవారల నంతఁ
గాంచి యనిపి యుచితగతిఁ జరించె. ౨౭౪

క. మృదుభాషిణియును గమలకు
సదయత మృదులోక్తులం బ్రసాదము గదురన్
బదిలముగఁ జరింపు మనుచు
నెద గరఁగఁగఁ జెప్పి పుచ్చె నెంతయుఁ గడఁకన్. ౨౭౫

క. మఱునాఁ డరుణోదయమున
మఱవక మధుకరుఁడు తన్నదుమానిసిచేతన్
గఱువతన మెనయ నోజను
దఱియఁగ రావించి మ్రొక్కె దద్దయు భక్తిన్. ౨౭౬

ఆ. వాని సాదరంబుగా నుచితాసనం
బందు నునిచి తగ నమందశుద్ధ
భావభాసుర మగు వచనంబులో నిట్టు
లనియె నతనిఁ జూచి యపుడు తాను. ౨౭౭

క. మావంటివార లవివే
కావిలులై యెట్టితప్పు నరయమివలనన్
గావించిన మిముబోంట్లు య
థావిధి సవరించి కరుణఁ దనరుప వలదే. ౨౭౮

మ. జననం బందితి వేదవేదియుతవంశంబందుఁ బెండ్లాడితిన్
ఘనుఁ డయ్యధ్వరయాజియాత్మజ వివేకం బేది మీబోఁటి
వా, రినయోక్తుల్ వినఁ గాన్పు లేమి జనితోద్రేకుండనై
యొప్పు త, ప్పు నెఱిం గానక సంచరించితి మహాభూదేవతా
గ్రామణీ. ౨౭౯

క. ఉన్నది యంతయు నెఱుఁగుదు
చన్నవిధంబునను దీనిఁ జక్కఁబఱుపవే

సన్నుతవిద్యాశాలివి
కన్నడ సేయకుము నన్నుఁ గావుము కరుణన్. ౨౮౦

చ. అని వినయంబుతో ననఁగ నాబుధశేఖరుఁ డాలకించి తాఁ
గనికర మాత్మలోఁ దనరఁగా నను నీయభిలాష యూర్జితం
బును మఱి యన్వయోచితముఁ బోఁడిమి మీఱఁగ నాకుఁ
దీర్ప నొ, క్కనికి వశంబె యైనను దగన్ సువిమర్శము
చేసి చెప్పెదన్. ౨౮౧

మ. అని యాలోచన మాచరించి యతఁ డర్హాన్వాయయుక్తం
బుగా, వినుతామ్నాయవిధిన్ వినిశ్చయము గావింపన్ ద
దర్థంబు తాఁ, విని మోదంబు విషాదముం గదుర నవ్విప్రో
త్తమున్ వీడుకొ, ల్పి నిజైకాంతగృహంబుఁ జేరె హృదయ
క్లేశంబు సైఁ బోపమిన్. ౨౮౨

క. అతఁ డమ్మెయిఁ గడు విమనా
యితుఁడై యుండంగ నెఱిఁగి మృదుభాషిణియున్
హితమతి నాశ్వాసింపఁగ
నతనికడకు నచ్చె వచ్చి యనియెను గూర్మిన్. ౨౮౩

క. ఏలా యింతలు వగవఁగ
వాలాయము గుమ్మమందు వార్చెదరు జనుల్
చాలఁగఁ బనివడి వచ్చిరి
యాలము సేయకుము వారి నాలింపు వెసన్. ౨౮౪

క. అని యాతనిశోకంబు న
పనయింపఁగఁ గార్యబుద్ధిఁ బరఁగించుటయున్

విని యాతఁడు వేగమ లే
చి నిజాత్మప్రాణదయితఁ జేరఁ దిగుచుచున్. ౨౮౫

తే. విప్రవర్యుఁడు సెప్పినవిధి సమస్త
మాయమకుఁ జెప్ప నాయమ యాలకించి
తద్ద నిట్టూర్పు పుచ్చియుఁ బెద్దతడవు
వగచి వల్లభుఁ గనుఁగొని పలికె నంత. ౨౮౬

ఉ. దీనికి నేల యింత మహిదేవుఁడు సెప్పు తెలుంగు మానినన్
మానఁగ వచ్చుఁ జల్పినను నష్టము లేదు తలంప వృద్ధస
మ్మానితవృత్తి యొక్కఁ డది మానుట యొక్కఁడు వీని
రెంట నే, దేని నొకండు చేసినను నేమియుఁ గష్టము లేదు
చూడఁగన్. ౨౮౭

చ. కమలకు నేమి వచ్చె నిటఁ గాంతునిఁ గూడి సుఖంబ యొందు
దే, శమున వసించుఁ గా కిచట సంతతమున్ మన మాద
రంబునన్, గ్రమమున దానిసేమ మమరం గనుచుండఁగ
వచ్చు లేఖలన్, సమయములందుఁ జూడను బోసం గెదుఁ
గాదె విచార మేటికిన్. ౨౮౮

క. అది యెట్లయినను గమలకు
విదేశవాసిపురుషుండె పెనిమిటి యగు ని
య్యది నిక్కము తప్ప దకా
మదిఁ గొనుమా నాథ యనుచు మానిని పలుకన్. ౨౮౯

క. భర్తయు విమలాత్ముండై
కీర్తించుచు భార్యపలుకు గీష్పతిసదృశుం

డాత్రి దిగవిడిచి చనియెను
కర్తవ్యము నిశ్చయించి కార్యము వెంటన్. ౨౯౦

క. కొన్ని దివసంబు లంతన్
జన్న యనంతరము వరుల సంపాదింపన్
జన్నట్టి ద్విజులు వచ్చిరి
తన్నికటంబునకు వేడ్క దనరారంగన్. ౨౯౧

క. వచ్చిన మధుకరుఁడు ప్రమో
దోచ్ఛలితహృదయుఁ డగుచు సముచితవిధమునన్
దచ్చరితము లగు దేశము
లచ్చుగ నాలించు వేడ్క నడుగఁగ వారున్. ౨౯౨

క. ఒక్కొక్క రొక్క దేశము
చక్కటులం దిరిగి తమవిచారించినచో
ప్పక్కఱత్తోడన్ మక్కువ
నిక్కముగాఁ బలికి మఱియు నిర్ణయ మంతన్. ౨౯౩

క. బొంబాయిరాజధానిన్
దంబారా వనునతండు ధరణీసురకులుం
డంబుజరిపుతుల్యుండును
యం బీ సీ యం పదంబు నందినవాఁడున్. ౨౯౪

క. కలఁ డొకఁ డాతఁడు నీసుత
నలఘుప్రీతిన్ వివాహ మగునటు పలికెన్
లలి నైదు వేలరూపా
యల నడిగెన్ దనకుఁ గట్న మారఁగ నీయన్. ౨౯౫

క. ఇంక నొకఁడు శాలిష్ఠరి
యంకంబునఁ జెలఁగునాతఁ డంకాజి యనన్
బొంకపుఁ బే రొందినవాఁ
డంకితముగఁ బదియువేల నడిగెడుఁ బెలుచన్. ౨౯౬

క. అతఁడున్ భూసురవంశుం
డతనూజ్జ్వలరూపుఁ డల్లుఁ డర్హుఁడు మీకున్
సతతము కరాచియం దా
యతనము గలవాఁడు పేర్మి నందినవాఁడున్. ౨౯౭

క. ఆరసి పెక్కండ్రను మన
సారఁ బరీక్షించి వీరి నరుదుగఁ గూడం
జేరి తగ నిర్ణయించితి
మీ రింకం గార్యశేష మిది యని చెప్పుఁడీ. ౨౯౮

మ. అని పల్కన్ మధుకృత్తు విత్తమునకై యాయాసముం బొంద
కి, ట్లను నవ్విప్రు లింకోడ వా రిటకు రా నంగీకరింత్రే తగన్
మనమే యచ్చటి కేఁగఁగావలయునో నావారు మీరట్లు వ్రా
సిన నిచ్చోటికి వార వత్తు రన వ్రాసెన్ వారికిన్ జాబులన్.

ఉ. వారును లేఖ లందిన నవారితులై మధుకృత్తునింటికిన్
గూరిమి నేగుదెంచిరి యకుంఠితబుద్ధి మధువ్రతుం డటన్
వారి యథోచితంబుగ సభాజనముం బొనరించి సమ్మదం
బారఁగ వారితోడఁ దగునట్టులు సల్లపనంబు సేయుచున్.

ఉ. వారల విద్యయున్ గుణము వారికులంబును వారికల్మియున్
వారక యెల్లనుం దెలిసి వారి యథార్థము గాఁగఁ బంపి

య, వ్వారిజనేత్ర యైనమృదుభాషిణిఁ గన్గొని యీవు
వీరిలో, నేరుపు మీఱ నేర్పఱపు నీసుతకుం దగువాని
నావుడున్. ౩౦౧

చ. కమలయె యేర్పరించునది కాంచిన దిర్వురముర్వు గావునన్
బ్రమితియె నామనం బనుచు భామిని పల్కిన నాలకించి య
క్కమలయుఁ దండ్రిచేత నడుగంబడియిట్లనె మీరు కిన్కడెం
దమున వహింపకుం డభిమతంబునువీడఁగ నాడుదున్ దగన్.

చ. అనుటయు నెట్టులైనఁ దనయగ్రసుతం దగఁ బెండ్లిచేసి వి
న్ననువునఁ బంపఁగాఁ దనమనంబునయందుఁ దలంచువాఁడు
గా, వునఁ గినియంగనేర మదిపూన్కిని బల్కు మటంచుఁ
దండ్రి సె, ప్పిన నది ధీర యాచు నుడివెన్ తనచిత్తగతంబు
నత్తఱిన్. 303

క. దేశంబు లంత వెదకి హ్మా
దీశులు వీ రంచు మీర లేర్పఱిచితి రిం
కే శాంతి నొంది మీయీ
పాశంబునఁ గట్టు వడఁగ వలయుం గాదే. 30౪

క. మీరే కడవం ద్రోచిన
వారలు సమయంబు నింతవట్టును నిపు డీ
వారననిర్బంధము నా
వారడిఁ జేయంగఁ దలఁచువారలు నాకున్. 30౫

క. అమర సుశీలకును మనో
రమకుం బలె నాకు మీదు క్రమ మారఁగఁ జే

య మదిఁ దలంచినయే న
ప్రమదంబున మీకు నెదిరి వల దంటినె యేన్. ౩౦౬

క. వీ రిద్దఱు దక్క నిఁకన్
పేరుకొనన్ వరులు లేరు పృథివీస్థలి నం
చేరుపడెఁ గాక నాకున్
గోరఁగ నే మున్న దిందుఁ గోరు మనుటకున్. ౩౦౭

క. బందుగులపొందు నాకుం
జెందఁగ లేనట్టివిధముఁ జేసితి రిపు డీ
రిందులకు నన్ను దూఱెద
రెందులకుం బోదు నకట హీనగతి నింకన్. ౩౦౮

క. నాదోసం బేమి యిటన్
మీదోసము మీ రెఱుఁగరు మెయిమెయి నన్నున్
దాగాలఁ దోలఁ దలఁచెద
రాదానికి వగవ నేమి యగు ఫల మింకన్. ౩౦౯

క. వీ రిద్దఱలో నెవరిన్
గోరుదు రొక్కంబు లెక్క కొంకుపఱిచెదన్
నేరక యేఁ బేరుకొనన్
వారక యలుక యగు మీకుఁ బలుకఁగ నేలా. ౩౧౦

క. అల భేషజంబువానిన్
గలితకలాకౌశలుండు ఘనతరుఁ డైనన్
గల నైన నొల్ల దుల్లం
బలుగకుఁడీ మదిని గలుగునది పలుకుటకున్. ౩౧౧

ఆ. అనిన మధుకరుండు ఘనశోకమోహముల్
మదిని వెల్లిగొనఁగ నుదితబాష్ప
రోధవికలకంఠుఁడై ధనంబునకు నీ
వింత చింత సేయ నేల కమల. 302

ఆ. ఐనదాని కింక నడలుట వ్యర్థంబు
కానిదాని కిపుడు కనల వలదు
దేశకాలయుక్తమై శరదం బగు
విధము సేయ వలయు వేఱు గాదు. 303

క. నీ కేమి కొఱఁత సేయక
శ్రీకిం బెంపునకు నీగి నెందక యుండన్
నీకోరిన ట్లొనర్చెద
వ్యాకులతయుఁ గొంకు విడువు పంకజవదనా. 304

ఆ. ఒకఁడు నిజకులంబు నకలంకముగఁ గాచు
నొక్కఁ డాంగ్లదేశ మెక్కినాఁడు
తలఁతు నింతమాత్ర ధనమునకై కాదు
నీమనంబు నెఱియ నెఱయఁ జూతు. 305

క. అని చెప్పి యంకనామునిఁ
దనరన్ రావించి వానిఁ దగఁ బలికి కొమా
ర్తను బదివే లగురూప్యము
లను వాని కొసంగె నంత లలితోడ వెసన్. 306

క. ఇర్వదివే లగురూప్యము
లార్వఁగఁ దనసతియు సుతయు నానందమునన్

బర్హ్వనకు మీాఱి యిచ్చెను
బర్హ్వంబునఁ గమల కపుడు ప్రమదం బెసఁగఁ. ౩౧౭

తే. అంత నంకాజి సతితోడ నతిముదమునఁ
దనదుపురము కరాచికిఁ దరలె నత్త
మామయును బ్రీతిఁ దన్ను సమ్మాననములఁ
దర్పితునిఁ జేయఁ బాయనితనివి నొంది. ౩౧౮

తే. వారలను బంపి యుచితసత్కారములను
దంపతులు తమ్ము నెంచిరి ధన్యులనుగ
నెత్తిమీఁద దుర్భర మయి యత్తమిల్లు
బరువు దించినయాభారవాహిపగిది. ౩౧౯

ఆ. నందనావిరహమునను జనియించెడు
శోక మధికధనము చూఱ వోవు
దుఃఖ మింత వారిఁ దొడర దయ్యె సుతకు
వరుఁడు వొంది పొందు వారయుకతన. ౩౨౦

చ. ఉపనయనంబుకై యిడిన యూర్జితవాసర మంతఁ జేర్వ యా
ట పరమయత్నత న్గని యటఁ బురుహూతగురూపముఁ
గురుఁ, స్వపరిసరంబు నొంద నగుచందము చేసి తగఁ
ద్వితీయపు, త్రిపరిణయంబు గూర్చి కడుఁ దీవరపా టొద
వంగ నిట్లనుఁ. ౩౨౧

చ. ద్విజకులవర్య నా దగుద్వితీయతనూజకు నిప్డు పెండ్లి సే
యుజతన మొనర్పఁ గోరితి సమున్నతి మాకు సమీప
బంధువుఁ, సుజనసమాజవందితుఁడు సువ్రతుఁడొ శివ

సోమయాజియా,త్మజున కొసంగఁగాఁ దలఁచెదన్ సుము
హూర్తము నిశ్చయింపుమా. ౩౨౨

ఆ. అనిన నట్ల కాక యని యగ్రజన్ముండు
దినముశుద్ధి సూచి యనియెఁ బ్రీతి
వచ్చువాసరంబె వచ్చుమీఱఁగ దీని
కనువు గాఁగ నున్న దనఁగ నతఁడు. ౩౨౩

తే. తనతృతీయతనూజయుద్వాహమునకు
మున్న దీని నొసర్పఁగాఁ బూని యున్న
తనదుపూన్కికి ననుకూలతను ముహూర్త
మొదవ నెంతయు నాత్మలో ముదము నొంది. ౩౨౪

క. మృదుభాషిణితో నిట్లను
నిది యొదవెన్ విమలపెండ్లికి మ్మగుమూర్తం
బుదియు గొని సంఘటింపుము
పదింబదిగ వలయువస్తువర్గము నెల్లన్. ౩౨౫

క. శివయుజ్వ పెంపుసంపద
లవి యెల్లన్ నీకుఁ గ్రొత్తలా యింకిట నే
మి విచారింపఁగ వలయును
దవిలినచుట్టంబు నీకుఁ దపనీయాంగీ. ౩౨౬

ఆ. హూణవిద్య యొకటి యూనంబు తక్కఁగు
వేదశాస్త్రములను విదితబుద్ధి
రూపవంతుఁడు నభిరూపగుణోజ్జ్వలుఁ
డతనికొమరుఁ డౌజనార్దనుండు. ౩౨౭

క. అన మృదుభాషిణి నెయ్యం
బున నియ్యకొనంగ నతఁడు పోఁడిమి లిఖియిం
చెను బంధువులకు నాప్తుల
కును శుభలేఖల ముదంబు కొనలొత్తంగన్. 328

క. కమలావృత్తాంతంబును
గ్రమమున విని యున్నవాఁడు కావున నత్యం
తముదంబు నొందె శివయ
జ్వ మనంబున నాప్తబంధుసంబంధముచేన్. 329

క. తనయున్నదుహిత మృదుభా
షిణితో వియ్యంబు నొందఁ జిరబద్ధాశుం
డనయము ప్రతిబంధవినా
శనమున శివసోమయాజి సంతస మొందెన్. 330

ఉ. ఆశుభలేఖ లందిన ననంతము సంతస మంది యన్న కై
ట్లాశుభవర్తనంబు హృదయంబునకున్ రుచియించె నంచుఁ
దా, నాశుగతిన్ విరుద్ధచరితాంధతమిస్రము పాయ నాయి
తం, బై శతపత్రమిత్రునిక్రియన్ దినకృత్తటఁ జేరె వేడుకన్.

క. చారుమతిమానవతులు మ
నోరమయు సుశీల సుమతి నూతన మగుపెం
పారఁగ దినకరుతోడం
జేరిమి నేతెంచి రెలమి మించి మెలర్పన్. 331

క. బందుగు లందఱుఁ గూడిరి
పొందు మిగిలె సమ్మదంబు పొరి నిండారెన్

వింను లెసంగెను సతతా
మందోత్సవ మయ్యె నపుడు మధుకరునింటన్. 333

క. సుముహూర్తము సేరువ గాఁ
బ్రముదితలై ముదిత లెల్ల భావుక మగుతా
నము సేయించిరి సుతులకుఁ
గొమరితకున్ దంపతులకుఁ గూరిమి మిగులన్. 334

క. సమయాతిక్రమదోషము
సమయఁగఁ దగుక్రియల నడపి సద్విప్రులతో
దమనునకు దుర్దమునకున్
గ్రమమున మధుకరుఁడు వడుగుఁ గావించె రహిన్. 335

క. మణికాంచనమయశుభభూ
షణభాసుర విమల విమలచారుతరాంగిన్
గుణరూపయుతుఁడు వరునకు
మణిధనశోభాయుతముగ మధుకరుఁ డొసఁగెన్. 336

శా. భూదేవప్రతతిన్ మహార్హవసనంబుల్ భూరివిత్తంబులున్
స్వాదుశ్రేష్ఠచతుర్విధాన్నములు నిష్టస్రగ్విలేపంబులున్
బ్రోదిన్ గోర్కికి మీఱనిచ్చి తనిపెన్ భూవిశ్రుతంబై నిజం
బౌదార్యం బెసలార నామధుకరుం డత్యంతసంప్రీతుఁడై.

మ. మణిభూషాంబరతల్లజప్రకరసమ్మానప్రదానంబులన్
బణితానేకకలాప్రసంగముల దివ్యన్నృత్తగీతంబులన్
గుణవత్కావ్యరసజ్ఞవిజ్ఞజనతాగోష్ఠిన్ యథార్థజ్ఞతా
చణుఁ డాతండు స్వబంధుమిత్రతతికిన్ సంతృప్తిఁ జేసెన్
రహిన్. 338

సీ. మహితశాస్త్రాంభోధిమథనసంపాదిత
జ్ఞానామృతాస్వాదు లైనబుధులు
సరసనిర్దోషబంధురకావ్యవరశిల్ప
కల్పనాకౌశలఖనులు కవులు
సకలపురాణేతిహాసతాత్పర్యస
ర్వంకషమతులు పౌరాణికులును
స్వస్వవర్ణోచితాచరణప్రవీణులు
బ్రాహ్మణక్షత్త్రియవైశ్యశూద్రు
లతులధనరత్నకనకభూషార్హవసన
దానమానాదివివిధసత్కారములను
నభినవచతుర్విధేష్టమృష్టాన్నములను
సాదరంబుగఁ దృప్తు లై తనిసిరి. ౩౩౯

ఉ. ఐదుదినంబులుం సముచితార్చల నర్చితు లైనబంధులుం
సాదరుఁడై సతీసుతసమావృతుఁ డామధుకృత్తు నున్నచో
వేదరహస్యవేది బుధవిశ్రుతుఁ డైనపురోహితుండు తా
నాదటఁ జారిమోజ్జ్వలము లౌవచనంబుల వారి కిట్లనున్.

చ. ఉవిదలె తల్లులై పరఁగుచున్నను గన్నది యొక్కనాతి యీ
భవమునఁ దల్లియై తనకుఁ బాల్పడు నెట్టులు ధర్మరూపముల్
భువి బహుభంగు లైనఁ దనపుట్టినజాతికి నేది చోదితం
బవు నదియే స్వధర్మ మగునట్టులు గా దది యుజ్జగింపఁగన్.

చ. తనజననిం ద్యజించి యొకతం దగునే వరియింపఁ దల్లిఁగా
జననులె యందఱుం జనిన జాయ తనూజయు నాఁడిగా
భువిఁ, జనియెడు భేదముల్ పొసఁగునా పరధర్మము భీక

రం బటం, చనిరి స్వధర్మమే తనకు నాదరణీయ మటందు
రొప్పుగన్. 383

చ. ఉదితుఁడ వైతి వైదికులయున్నతవంశమునందు మేదినిన్
విదితులు నీకులంబున జనించినవారు స్వధర్మనిష్ఠతన్
సదమలబుద్ధి నాంగ్లకలఁ జాతురి ఖ్యాతి వహించి నిత్యసం
పదలఁ జెలంగుచిప్పుడు స్వభావజధర్మముఁ బొందితీవు నాన్.

క. ముదిత యగుచు మృదుభాషిణి
మృదుతరవాక్యముల ననియెఁ బ్రియునిఁ బురోధన్
గదిసినబంధువులం గని
సుదతి మనోరమను జూపి సుస్మితముఖయై. 384

క. ఈచిన్నికూఁతుమహిమయె
యీచరితకుఁ గారణంబు కృతమతులారా
యీచంద్రసుందరాస్యను
జూచినయపు డెల్లఁ దలఁతు శుద్ధచరిత్రన్. 385

క. దీనిముఖచంద్రబింబము
గానఁగఁ బోనాడుఁ దమము కనఁబఱుచును స
న్మానితమార్గము నాకుం
గానఁగఁ గాదయ్యె నిందుఁ గారణము దగన్. 386

క. అనుటయుఁ బురోహితుం డను
వనితామణి పూర్వజన్మభావితధర్మం
బు నిమిత్తమాత్ర నుదయిం
చును బ్రతిబంధంబు దొలఁగుచో హృదయమునన్. 387

ఆ. అలనిమిత్త మయ్యె జలజాక్షి యీకన్య
యిది విశుద్ధభావ వీతదోష
యగుట దీనిభావి యమలచరిత్రంబు
దేవతలకు నేనిఁ దివురఁ దగును. ౩౪౮

క. అని యాశీర్వాదము చే
సినఁ దల్లియుఁ దండ్రియున్ విశిష్టాప్తగణం
బును మోదంబునఁ బొదలిరి
వినుతించుచుఁ గన్యపెంపు విస్మయ మూరన్. ౩౪౯

క. అనుజుని మానవతిం గని
ప్రణయంబున మధుకరుండు పలికెను మీ రీ
తనయను బెంచితి రేత
ద్ఘనతయు మీయదియ గాని తలఁపఁగ నొండే. ౩౫౦

క. అనునివి మొదలగువచనము
లను వారిఁ బ్రమోదసాంద్రులను జేసి తగన్
ఘనవస్త్రాభరణాదిక
మున సంభావించెఁ దాఁ బ్రభూతప్రీతిన్. ౩౫౧

క. అంత మృదుభాషిణియుఁ ద
త్కాంతను జారుమతి సుశీలఁ దనయను నెమ్మిన్
గాంతతరవసనభూషణ
సంతతి సంతసము గదుర సంభావించెన్. ౩౫౨

క. సుమతికి నెంతయు వారలు
దమనునిచే దివ్యచేలతతిమణిభూషా

సముదయము సమాదరమునఁ
దమి నిప్పించిరి సమంచితంబుగ గరిమన్. ౩౫౩

తే. సుమతిసంస్కృతవాక్పరిశ్రమముఁ గాంచి
విబుధు లందఱు నద్భుతావిష్టు లైరి
దమనదుర్గము లాంగ్లవిద్యాజ్ఞు లయ్యు
హ్రీణు లైరి త్రిదశభాష నెఱుఁగ కునికి. ౩౫౪

తే. బ్రహ్మకులమునఁ బుట్టి సుపర్వభాష
నెనయఁ జాలక పెరవాణి నెంత నేర్చి
నను ద్విజోత్తమసభల నున్నతి గనంగ
నేరమిని విప్రబాలురు నేర్చి రపుడు. ౩౫౫

క. పెంపునకును సంపదకును
సొంపారఁగ వార లంత సొరిది స్వజనులన్
బొంపిరివోవఁగఁ బంపిరి
నింపున నంపకము చేసి నెలవులకుఁ దగన్. ౩౫౬

చ. దినకరుఁ డంత సంతసము దేరఁగఁ గాంతయు దాను నప్పుడ
న్నను వదినెన్ నిజాలయమునన్ జరుగంగ సునిశ్చితంబు లౌ
తనయులపెండ్లియు న్వడుగుఁ దార యొనర్పెఁడి మీరు
వచ్చి యం, చని వినయంబుతోడఁ దగఁ బ్రార్థన నర్థి
నొనర్చె నెంతయున్. ౩౫౭

ఉ. వారలు సమ్మదంబున నపారవిభూతిసమేతులై రయం
బార స్వబంధుమిత్త్రసముదాయముతో సుముహూర్త
వాసరం, బారసి కొన్నినాళ్లకు నందులముందుగఁ జేరి

రెంతయుఁ, బేరిమిఁ దమ్ముఁ డిమ్ములను బెన్నిధి యబ్బిన
యట్లు లుబ్బఁగన్. 358

క. బాంధవసముదయ మంతయు
సింధువు పెల్లుబ్బినట్లు సేరె నచటికిన్
బంధురవైదికధరణిసు
ధాంధుల పెం పచటఁ గనఁగ నయ్యెను గనులన్. 359

క. సుముహూర్తంబున విప్రుల
గమియాశీర్వాదరవము గడలుకొనంగన్
సుమతికి నుపనయనంబును
విమలుఁడు దినకరుఁడు చేసె విధియుక్తముగన్. 360

క. అంతన్ గమలోదరునకుఁ
గాంత సుశీలను మహార్ఘ్య కాంచనభూషా
కాంతతరాంగి నొసంగి న
నంతం బగు బ్రహ్మలోక మందెదుకోర్కెన్. 361

క. వెంబడిఁ బురుషోత్తమునకు
సంబరమున నవ్యదివ్యజాంబూనదభూ
షాంబరలసిత మనోరమ
నంబయు జనకుండు మెచ్చి యలరఁగ నిచ్చెన్. 362

క. వారలు వీరలు నాక
వ్వారిగ వసుధాసుపర్వవారము భక్తిన్
భూరితరంబుగ నాతఁడు
భూరిసుచేలప్రదానముల నలరించెన్. 363

మ. నిజబంధుప్రతతుల్ సుహృద్వితతులున్ నిండారుమోదంబు
నొం, ది జగంబం దెటనేని నిట్టి నెపుడున్ విన్నారమే
విందు లం, చుఁ జవుల్ క్రొత్తవి యూరఁ బ్రస్తుతివచో
శూన్యాననాంభోరుహ, వ్రజలై యన్యము నెన్న వయ్యోను
భుజివ్యాపారపారీణతన్. ౩౬౪

తే. వివిధదేశనివాసముల్ విప్రగణము
లర్థి సంతృప్తి నొందిరి యటఁ జతుర్వి
ధంబు లగునిష్టమృష్టాన్నతతులచేతఁ
బ్రణుతసంతతభూరిదక్షిణలచేత. ౩౬౫

చ. అటఁ జనుదెంచువైదికుల యాచరణంబును గాంచి తాను
ను, త్కట మగుబ్రాహ్మధర్మపరతన్ వహియించె మధు
వ్రతుండు సం, కటసమయంబులందును దగన్ విధిచోదిత
మైనకర్మమున్, బటుతరభక్తి నించుకయుఁ బాయక చే
యుచు నుండె నంతటన్. ౩౬౬

చ. అనితరదుర్లభ మైనయది యచ్చటివిప్రులు చూచి యింత
యొ, ప్పనె ఘనుఁ డుత్తమద్విజులఁ బోలి చరించెడు నంచు
నద్భుతం, బెనయ మహాత్ముఁ డొక్కరుఁ డహీనశుభాశుభ
వేదనుండు పి, న్ననగవు వక్త్రపంకజమునన్ జెలువారఁగ
వారితో ననున్. ౩౬౭

మ. అది స్వాభావికమై చనున్ నియతధర్మాయత్తచేతస్కులన్
గదియం జేరఁ దదీయధర్మపరతాగంధాభిసంబంధమా
త్రేఁ దనంతన్ జనియించు ధర్మరతి యాత్మన్ దేహి కుర్విన్

శుభా, స్పదమా ధార్మికు లైనవారి సహవాసం బంద్రు
దానఁ బుధుల్. ౩౬౮

తే. నిర్మలం బగు డెందము నెమ్మి నిలుచు
ధర్మపరులసంయుక్తిచే ధర్మమందు
మలిన మయి మోహ మొంది నిమగ్న మగు న
ధర్మపరులసంయుక్తి నధర్మమందు. ౩౬౯

తే. ధార్మికులసహవాసము ధర్మమందుఁ
బ్రీతి పుట్టించి రుచి దనరించు మఱి య
ధార్మికులసహవాస మధర్మమందు
మోహ మొందించి రుచి మదిఁ బొనరఁజేయు. ౩౭౦

చ. అదియును గాక యొక్క ప్రణయం బొగి నింతకు హేతు
వయ్యె న, య్యది మృదుభాషిణీసతిమనోంబుజమాధ్వి
మధువ్రతుఁ గదఁ, హ్యాది మరగించి లోఁగొనియె నిం
పున సచ్చరితాత్ముఁగాఁగ న, య్యదనున గాఢశోక మటు
లయ్యెను ద్వారము దానికిం దగఁ. ౩౭౧

క. మగవారికంటె సహజము
మగువలకుఁ ధర్మమతి సమధికం బౌటఁ
మగవారు వారిఁ గావం
దగు ననుచు న్మనువు సెప్పె ధర్మము నిలుపఁ. ౩౭౨

క. మగఁ డెంతపాడిఁ దొఱఁగిన
మగువ స్వధర్మంబునం దమర శిక్షిత యోఁ

దిగిచి యధర్మమువలనన్
దగవునకుం దెచ్చు వాని నైజసుచరితన్. 323

క. కావునఁ బిన్నతనంబునఁ
బావన మగుకులముధర్మపద్ధతి నేర్పం
గావలయు నాటునట్టులు
దావలముగ లోకమునకుఁ దరుణులకుఁ బితల్. 324

ఆ. సోమనాథుఁ డట్లు సారిది బాల్యంబునఁ
గఱపినందువలనఁ గాదె మృదుల
భాషిణి గుణ మొప్పి భర్త నధర్మంబు
వలనఁ దిగిచి నిలిపెఁ బాడియందు. 325

క. అని పలికిన విని వారలు
వినయంబున నమ్మహాత్ము విజ్ఞానము పెం
పు నుతించి మ్రొక్కి రెంతయు
మనంబు లానందరసనిమగ్నంబులు గాన్. 326

మ. అటు లుద్వాహవిధాన మంతయు నఖండానందసాంద్రం
బుగా, నట సంపూర్ణత నొందినన్ మధుకరుం డత్యంతసద్ధ
ర్మధీ, పటుభావంబు మనంబునం దగిలి నిల్వన్ దారపు
త్రాన్విత్మజా, భటసందోహముఁ జేర్చిఁ దోడ్కొని చనన్ స్వ
స్థానముం జేరఁగన్. 327

క. మృదుభాషిణి హర్షింపన్
హృదయంబున మధుకరుండు హీరాదులతోఁ

బొదిగినభూషణముల న
భ్యుదయముగా నిర్వురకును నొసఁగె సుతలకున్. ౩౨౮

క. అల్లుండ్రకు నిరువురకుం
బెల్లుగ నాభరణధనసమితి నిచ్చెఁ గరం
బిల్లాలు సంతసింపఁగ
నల్లు రనన్ బ్రాణసదృశు లత్తలకుఁ గదా. ౩౨౯

క. దమనుని దుర్దమునిం దన
యమేయవిత్తము నభేద మలరఁగ విభజిం
చి ముద మెసఁగ నొసఁగి తనకు
సములనుగాఁ జేసి మెలఁగె సంతృప్తిమెయిన్. ౩౩౦

ఉ. తానును ధర్మయుక్తి సతతంబును దప్పక దేశకాలముల్
పూని చరించుచున్ దివిజపూజ లొనర్చుచు బ్రహ్మబృంద
మున్, దానసమర్హణాదివిధిఁ దర్పితముం బొనరించుచుం
పుగన్, మానినితో నతండు బహుమానవిశాలయశంబు
గైకొనెన్. ౩౩౧

ఉ. ఆతనియాత్మజుల్ జనకునట్టులు పక్షిమతానువాదులై
యాతతసంపదం బొదలు చాతఁడు నిల్పినధర్మనిష్ఠ ని
త్యాతవరం జరించుచు శుభాయురనామయతామహాసుఖ
స్ఫీతశరీరులై మనిరి పేరిమిఁ గూరిమి నొండొరుల్ తగన్.

చ. కమల నిజాత్మనాథునియగారమునందుఁ గరాచిలోఁ దదీ
యమతిని నిల్చె నైనను దదాప్తులు తన్ను నిరాకరించి
పెం, పు మదిఁ దలంప కుద్ధతిని ముష్కరతం గర మార్తి

నొందఁగా, సమదతఁ జేయ నింతయును స్వాంతమునందు
సుఖంబు లేవడిన్. ౩౮౩

చ. మనుగడ యచ్చటం దనకు మానవిహీనతఁ గష్టమై తగన్
వనిత నిజేశుతోఁ దెలిపి వల్లభుచే నిసుమంతయే గుణం
బును గన కంతరంగమునఁ బొక్కుచుఁ దండ్రికి జాబు వ్రాసి
యా, తని దగుసమ్మతిన్ దుదకుఁ దాను వినిశ్చితచిత్తయై
యటన్. ౩౮౪

మ. తనపుత్త్రిన్ దనవిత్తమంతయును నంతన్ వేగ గైకొం
చొగిన్, జనకుం డున్న పురంబునందు నొక వేశ్మంబు న్నివా
సంబుగాఁ, గొనెఁ దద్వృత్తము లోకమందుఁ దెలుపన్
క్షోదీయు లైనట్టివా, రనయాత్మన్ దలపెట్టునూతనదురర్థా
బంధుసంబంధమున్. ౩౮౫

క. విమలయు జనార్దనునితోఁ
బ్రమిత్యతీతసుఖభోగభాగిని యగుచున్
గోమరారె బహువిధక్రతు
సమితిసమారాధితసురసముదాయునితోన్. ౩౮౬

క. పతియింట సతతధర్మ
వ్రతాచరణమహిమ విమలభావ యయి తగన్
సతి విమల తొల్లిటిగుణం
బు తొఱంగి హితము నెఱింగి పుణ్యచరిత్రన్. ౩౮౭

ఆ. తనదుసచ్చరిత్ర జనులు ప్రశంసింప
దానమానములను ధరణిసురుల

తృప్తి సేయుచుండె మృదుభాషి
సుతులయభ్యుదయము సారిదిఁ గనుచు. ౩౮౮

ఆ. సుమతి సుమతి యగుచు సుచరితోజ్జ్వలుఁ డయి
యాంగ్లవిద్యయందు నగ్రపదముఁ
బడసెఁ దన్ను మానవతి తోడుగాఁ గాచి
యుండ రాజధాని నుండి చదివి. ౩౮౯

క. మొదలన్ రాజప్రతినిధి
ముదలన్ వహియించె నతఁడు పూజితపదమున్
జదలన్ జందురుకైవడిఁ
బొదలెన్ నిజవంశమున సమున్నతదీప్తిన్. ౩౯౦

చ. పొలుపుగ మండలాధిపసమూహములోపల నగ్రగణ్యుఁడై
చెలఁగె ధరాసుధాశకుల శేఖరుఁడై నిజధర్మకర్మసం
కలనపవిత్రుఁడై విబుధకామితదాననిబద్ధదీక్షుఁడై
లలితగుణాభిరామసుకళత్రసుతుం డయి యాతఁ డిమ్మహిన్.

చ. జనకునిఁ గొల్చె నిత్యము విశంకటభక్తి వినీతచిత్తుఁడై
జననికి మోదముం గొలిపె సంతతమున్ బ్రియ మాచరిం
చుచున్, వినయముతోడ బాంధవులఁ బ్రీతమనస్కులఁ జేసె
నెప్పుడున్, ఘనతఁ జెలంగె నాసుమతి నాఁడును నేఁడును
గీర్తిసంపదన్. ౩౯౨

క. కమలోదరుఁడు సుశీలా
ప్రమదను నెయ్యమునఁ గూడి ప్రమదం బారన్

క్షమలోఁ బహువిధభోగము
లమరం దనరెను వసుంధరామరనుతుఁడై. ౩౯౩

ఉ. రాజ్యమునందు నాతఁ డొగిఁ బ్రాభవ మొప్ప మహాధి
కారమున్, బూజ్యత రాజకీయు లగుపూరుషు లెన్నఁగ
నొంది సంతత, ప్రాజ్యవిభూతిఁ జెన్నెసఁగె బంధుగణస్తుతి
పాత్ర మాచు దే, వేజ్య సురేంద్రుఁ గేరెదునుదీర్ణత
ధీయును శ్రీయు మించఁగన్. ౩౯౪

చ. అలరె సుశీల సాధువుల కర్ణములన్ బ్రమదం బొనర్చుచున్
గులమున పెద్దలన్ మిగులఁ గూరిమి పేరిమి గారవించుచున్
బలువగలన్ సువాసినుల బ్రాహ్మణులం దనుపారఁ జేయు
చున్, జెలువమునన్ గుణంబులను శ్రీమహిమన్ మహి
లాలలామమై. ౩౯౫

క. అమరుం బురుషోత్తముఁ డన
రమణుఁడు పురుషోత్తముండు రమణి యగుమనో
రమయును రమ యనఁ దనరున్
క్షమలో నని యంద్రు నిఖిలజనములు ప్రీతిన్. ౩౯౬

ఆ. పురుషసత్తముండు పురుషోత్తముండును
న్యాయవాది యగుచు నయమునందు
ఖ్యాతిఁ గాంచి యొందె న్యాయాధిపత్యము
తోడివారు ప్రీతితో నుతింప. ౩౯౭

చ. అల పురుషోత్తముం డెనసి న్యాయసభాధిపతిత్వ మచ్చటన్
మెలఁగెడున్యాయవాదులు గణేయులు తన్ను భజింపఁ బెం

పుష్టి, నలరుచు నింట బంధుసముదాయము లాదటఁ గొ
ల్వఁ జేరిమిఁ, జెలఁగుచు నుండె సంతతవనీపకసాత్కృత
విత్తరాశి యై. ౩౯౮

క. తనపతి తగవులఁ దీర్చుచు
జనముల విష్ణుండఁ బోలె సాఁకఁగ సతియున్
గనికరమున బీదలఁ దా
ధనవంతులఁ జేసి తనరె ధర లక్ష్మివలెన్. ౩౯౯

ఆ. తల్లి దలఁచినట్లు తలఁపుమానిక మయ్యొ
నుభయకులములకును శుభము లెసఁగ
యశము కలిమి చెలిమి యభ్యుదయంబు లిం
పార మెలఁగి యామనోరమాంబ. ౪౦౦

చ. దినకరుఁ డున్నతిం దనరె దేవతలన్ మహిదేవతాతతిన్
దినదిన మర్థిరాజి నతిథిప్రకరంబుఁ గరంబు కూరిమిన్
దనుపుచు సంతతేష్టనమనప్రతిపాదనమృష్టభూరిభో
జనములఁ బుత్త్రిచే వినయసంపదఁ బూజితుఁ డౌచుఁ
బత్నితోన్. ౪౦౧

క. తనయుని పెంపును దనయా
ఘనతయుఁ గాంచుచు ముదంబుఁ గని రందులకున్
జను హేతు వంచు మానవ
తిని బొగడుచుఁ జారుమతియు దినకరుఁడు మహిన్. ౪౦౨

క. ఇది సుందరశబ్దార్థస
ముదితము ప్రణయవిజయంబు పొందుగ దీనిన్
జదివెడు బాలాబాలుర
కొదవెడు సుచరిత్ర నిజకులోన్నతి శుభముల్. ౪౦౩



# లఘుటిప్పణము.



౧. పరమదయానిధిఁ = గొప్పదయకు గని యైనవానిని; విశిష్టధర్మసంభరణుఁ = ఉత్తమ మగుధర్మము రక్షించువానిని; అధర్మనిర్మథనుఁ = అధర్మము పోఁగొట్టువానిని; భవ్యగుణోదయనామరూపవిస్ఫురణుఁ = మంగళకరములైన గుణముల గొప్పతనముచేతను పేరులచేతను రూపములచేతను ప్రకాశించువానిని; అశేషసాధుజనపోషణుఁ = ఎల్లసత్పురుషుల పోషించువానిని; లోకహితప్రవర్తనాచరణుఁ = లోకములకు మేలుగలిగించుటయే కార్యముగాఁ గలవానిని; సురేంద్రవంద్యపదసారసుఁ = దేవేంద్రునిచే మ్రొక్కఁదగినకమలములవంటి పాదములు గలవానిని; ఈశ్వరుఁ; ఇష్టసిద్ధికిఁ = కోరినవస్తువు యొక్కలాభముకొఱకు; భావమునందుఁ = మనస్సునందు; కొలుతుఁ = సేవింతును. గ్రంథకర్తను నేను కర్త.

౨. సకలవిద్యాకలితుఁడు = ఎల్లవిద్యలచేతను బొందఁబడినవాఁడు; సత్ మార్గవర్తకత్వబిరుదముఁ = మంచిమార్గము కలిగించువాఁ డగుట యను బిరుదు గూడ; కలవాఁడును; కలవాఁడును = ధనవంతుఁడును; చలముఁ = పూనికియును; చనవుఁ = సాగుదలయును; అనువుఁ = ఉపాయమును; చాలినవాఁడుఁ = చాలినంత కలవాఁడును.

**3.** బుధనికరము = పండితులసమూహము; మధువు = తేనె; ఒలికెడువాక్ చాతుర్యధనంబునఁ = ఒలుకునట్టి మాటల నేర్పు అను ధనముచేత; వినుతి = పొగడ్తను.

౪. వారక=ఉత్సుకత; తలఁగండు=తొలఁగఁడు.

౫. భారతఖండంబునన్ = ఇండియాదేశమునందు; నిజభారతి= తనపలుకు; పొలసి= వ్యాపించి; భాసిల్లఁగన్=ప్రకాశింపఁగా; శోభారమణీయను=కాంతిచేఁ జక్కని దానిని; సారయశోరమణిని=ఉత్తమ యగుకీర్తికాంతను.

౬. రహిన్ = ఆనందమును; నాకాచార్యునిన్ = బృహస్పతిని; కేరెడుజోకన్ = గేలిచేయువిధమున; వాక్యగరిమసొంపు = మాటల గొప్పతనముయొక్క అందము; తలిర్పన్= ప్రకాశింపఁగా.

౭. బహుమతములన్ = గౌరవింపఁబడినవగు; యుక్తియుక్తభాషితములన్=యుక్తులతోఁగూడిన మాటలచేత.

౮. పనివినిపించును=ఆజ్ఞకులోఁబడునట్లు చేయును.

౯. చక్రవర్తితాశ్రీరమణీమణీపతి = చక్రవర్తి యగుట యనుకాంతారత్నమైనలక్ష్మికి నాథుఁడు; ధర్మశాసనమహాసభలన్= హైకోర్టుల ననుట; శోభారతిన్= ప్రసిద్ధియందలి యాసక్తిచేత; పక్షధర్మగతివాదివరుం డయి = పక్షము గలవారి ధర్మముయొక్క విధమును వాదించువారియందు ఉత్తముఁడై, వక్కీళ్ళయం దుత్తముఁడై యనుట.

౧౦. ద్వితీయ= భార్య; చేతోహరములు = మనోహరములు.

౧౧. ఆంగ్లవచోమహాసియపాండితీశ్రీయుత = ఇంగ్లీషుభాషయందు గొప్పపాండిత్యసంపదతోఁ గూడినది; పుంసమాజములు = పురుషులసమూహములు; సర్వదేశఆయతన ఉల్లసత్ సభలయందున్ = ఎల్లదేశములయందలి భవనము

(హాల్) లయందు ఒప్పుసభలయందు; దిగంతఆయతకీర్తిపంకజ దలాక్షుని = దిక్కులచివరలయందు విశాల మగుకీర్తి యను కాంతను; అనుంగు నెచ్చెలిన్=ప్రియసఖినిగా.

౧౨. తగవుతగములను=న్యాయాన్యాయములను; విగత భయశీల=పోయిన భయస్వభావము గలది; అభీరుక=భయము లేనిది.

౧౩. ధీదీపంబునన్ = బుద్ధియను దీపముచేతను; ద్వీపంబునన్—ఇండియాద్వీపమునం దనుట.

౧౪. సత్ వచోనయయుతిచేన్ = మంచిమాటలయందలి నీతియుక్తిచేత; పయిదలి = కాంత; ప్రాభవధీవిభవంబులు= సామర్థ్యమును బుద్ధిసంపదయును.

౧౫. తదీయకలానివసతి= ఆ యాంగ్లేయులవిద్యలకు స్థానము.

౧౬. తనయులు=తనయలును తనయులును.

౧౭. నవవిద్యాచతురత్వమున్ = క్రొత్తవిద్యయందు నేర్పును; కొలుపన్=పొందించుటకు; ఆంగ్లవరఆచార్యులతోన్ = ఆంగ్లేయు లైనయుత్తము లగునుపాధ్యాయులయొద్ద; తత్ కాంతాఆలితోన్=ఆ యాంగ్లేయస్త్రీలసమూహమునొద్ద.

౨౧. నుత్యమై = పొగడఁదగినదై; లోకలోచనపర్వప్రదము=జనులకన్నులకు సంతోషము నిచ్చునది; చంచత్ కాంతి రత్న ఉల్లసత్ కనకంబుఁబలెన్ = ప్రకాశించుచున్న కాంతిగల రత్నముచే నొప్పుబంగారమువలె; వారికి విద్యయును రూపమును గలుగుట మేలిరత్నమును బంగారమును గూడియుండు నట్లు ప్రకాశింపఁగా నని తా. అద్వాద్వమై=సాటిలేనిదై.

౨౨. రమణీయఅనూనకౌశలంబును = చక్కని గొప్ప నేర్పును.

౨౩. కన్నడ=ఉపేక్షను.

౨౪. చిఱుతకలను=బాలికలను.

౨౫. పోరాడదు=కష్టపఱుపదు.

౨౬. చిన్నిచిన్నెలన్ = చక్కనిలక్షణములను; ప్రమద సలిలపూర్ణవదన=ఆనందబాష్పములచే నిండినమోము గలది; తలఁపుమానికము=చింతామణి.

౨౭. నిజకులానురూపనియతిన్= తనకులమునకుఁ దగిన నియమముచేత; వన్నె=అలంకారము.

౨౮. మృదుశీలన్= మెత్తనిస్వభావము గలదానిని.

౨౯. ధర్మచారిణీవ్రతంబు = ధర్మము నాచరించుదాని నియమము.

౩౦. సముదీర్ణతన్ = మిక్కిలి గొప్పతనముచేత; వర అధికారము = గొప్పయుద్యోగమును; వేదవర్త్మనిరతుఁడై= వేదమునందుఁ జెప్పఁబడినమార్గమునం దాసక్తి గలవాఁడై.

౩౧. యమళులు = అమడలు; కులఅభిరామసుచరితులన్=కులమునకుఁ దగిన మంచినడవడి గలవారును.

౩౩. మహీసురవరుతోన్ = బ్రాహ్మణోత్తమునియొద్ద.

౩౪. పితల్=తల్లిదండ్రులు.

౩౫. అనావిలబుద్ధియున్= నిర్మల మయినబుద్ధియు; తారకాగణమునందున్=నక్షత్రములసమూహములోపల.

౩౬. ధర్మవేది = ధర్మము నెఱింగినవాఁడు; ఒజ్జ = ఉపాధ్యాయుఁడు; హృదయపేటియందున్ = మనస్సు అను పెట్టె

యందు; సుశీల కర్త్రి పూర్వపద్యమునుండి యనువర్తించు చున్నది.

౩౯. ముగుద = బాలిక, సుశీల; కడానికిన్ = బంగారమునకు.

౪౧. అదియును — మనోరమయును; ప్రమదంబు = సంతోషము; తత్ సదనమునన్=ఆదినకరునింటియందు.

౪౩. కులపాలికలకున్= కులస్త్రీలకు; నిలింపభాషను= సంస్కృతమునందును.

౪౪. దేవభాషను = సంస్కృతమునందు; సుసాహితి = మంచిసాహిత్యమును; నైజవచోనిరూఢియున్ = తనభాష యందు నేర్పును; ద్విజవర్తనఉచితక్రమమును = బ్రాహ్మణుల యాచారముయొక్క తగినవిధమును.

౪౬. ఆయతశాస్త్రమార్గవిదుఁడై = గొప్ప దగుశాస్త్ర ముయొక్కమార్గము నెఱింగినవాఁడై; అమలఆత్మకుఁడు = నిర్మల మైనబుద్ధి గలవాఁడు; దీప్రరత్నాయితమై=ప్రకాశించు నట్టి మణివలె నున్నదై; మణి ప్రతిబింబమును గ్రహించునట్లు సుమతిబుద్ధి గురువు చెప్పినదంతయు గ్రహించె నని తా. ప్రాయము లేఁతదై యలరువానిన్ = ఎవనియందు ప్రాయము లేఁతదై యలరునో అట్టిసుమతిని.

౪౭. ఆంగ్లభాషావిచక్షణులు = ఇంగ్లీషుభాషయందుఁ బండితులు.

౪౯. సునిశ్చితఆత్ముఁడు= చక్కగా నిశ్చయించినబుద్ధి గలవాఁడు; సుకృతఆచారపరాయణన్=పుణ్యకార్యములయందు ఆసక్తురాలను; ప్రావణ్యము=ఆసక్తి; దినకరుఁడు కర్త.

౫౦. లోకనయంబునందుఁ = లోకముయొక్క న్యాయమునందును; సాయంబుఁ=సహాయమునుగా.

౫౧. అమరభాషను= సంస్కృతమునందు; చాతురిఁ= నేర్పును; అల్పజ్ఞుఁడు=కొంచెము తెలిసినవాఁడు; పూర్ణవిద్యాలయుతపేతపురములందుఁ = సర్వకలాశాల (కాలేజీ) లతోఁ గూడినపట్టణములందు.

౫౨. ఏష్యంబు= కోరఁదగినది; సువృత్తియుఁ = మంచి జీవనమును; లోను=మొదలుగా; తొయ్యలీ—మానవతిసంబోధనము.

౫౩. ఇమ్ములఁ=సుఖముగా; వితర్కము=విచారము.

౫౪. మానితశీలా = పూజింపఁబడిన మంచినడవడిగలదానా!

౫౫. ఇంతియుఁ—మానవతియును; చింతఁ= ఆలోచనచేత; దంతురితభ్రూలతమై = మిట్ట పల్లములుగాఁ జేయఁబడిన (ముడివడిన) తీగెలవంటిబొమలు గలదై.

౫౬. వందురిదేవు= దుఃఖపడెదవు; మొగిఁ= పూనికిని; అనా=అన్నా !

౫౭. అప్పనికడనకుఁ= ఆకార్యము సాధించుటకు; జతనఁ=యత్నమును.

౬౦. నల్వును=నేర్పును; చెల్వును= అందమును; సన్నుతస్థేమయుఁ=మిక్కిలి పొగడఁబడిన నిలుకడ గలదియు; సత్చరిత్రయుఁ = మంచినడవడి గలదియు; మనోరమవిశేషణములు. గుణఆరామకుఁ=మంచిగుణములే ఉద్యానవనముగా (క్రీడాస్థానముగాఁ) గలదానికి; రట్టు=నింద.

౬౧. వానిఁదెలుపక=వానికి బోధింపక.

౬౨. అహంకృతిన్ = గర్వముచేత; పేర్చి = రేఁగి; ఉదితము= చెప్పఁబడినమాటను.

౬౩. పతిహీనను=విధవను; స్వతంత్రయుక్తిన్= స్వాధీనమయినయుపాయముచేత.

౬౪. అతఁడు— మధుకరుఁడు, అర్థఅధికతన్ = ధనముచే గొప్పయగుటచేత; ప్రమత్తుఁడు=మైమఱచినవాఁడు; మహార్థఅధీశులు=అధిక మయినధనమునకుఁ బ్రభువులు; అబలన్= స్త్రీని; హైన్యస్థితిన్=తక్కువతోడి యునికిని; విధియుక్తిన్= శాస్త్రముతోడి కూడికచేత.

౬౬. ధర్మపరులచరితన్ = ధర్మమే ప్రధానముగాఁ గలవారి యాచరమును.

౬౭. ధర్మనిష్ఠవలనన్ = ధర్మమునందునికివలన; అల్పసుఖము = కొంచెమైనసుఖము గలది; అనర్థఆకులంబు=ఆపదలచే నిండినది.

౬౮. నెఱి = తృప్తి; నిజకులకృతంబు = తనకులముచేతఁ జేయఁబడినదానిని.

౬౯. నిర్మలఆచారుఁడవు = పరిశుద్ధ మయిననడవడి గలవాఁడవు; అమలమతివి=దోషము లేనిబుద్ధిగలవాఁడవు.

౭౩. ప్రాప్తకాలముల్=పొందఁబడిన కాలము గలవాని, ఆకాలముననే చేయువలసినవాని ననుట. ద్విజఉచితవిధానము=బ్రాహ్మణులకుఁ దగినకర్మమును, ఉపనయనము ననుట. ఉద్ధతుఁడై=గర్వించినవాఁడై.

౭౪. ఉగ్గడించుచోన్ = చెప్పునపుడు; ప్రలయయమ

ఆకృతిన్ = ప్రలయకాలమునందలి యమునివలె; ప్రల్లదము= దుర్భాషణమును.

౭౫. పిండము=అన్నము; ఉమ్మలికంబున్ = దుఃఖమును; ఆర్చికొంచున్ =అడంచికొనుచు.

౭౬. హూణవచోనిరూఢిమెయిన్ = ఇంగ్లీషుభాషయందుఁ బాండిత్యముచేత; లోకఅభ్యున్నతిన్ = లోకమునందు గొప్పతనమును; శీలగుణయుక్తున్=మంచియాచారముతోను గుణములతోను గూడినవానిని.

౭౭. అయత్నప్రాప్తము=యత్నములేక పొందఁబడినది; ఔన్నత్యము=అయినగొప్పతనమును; ఏవగింపన్=రోఁతపడఁగా; అవిచారదోషమునన్ = ఆలోచన లేకుండుట యనుదోషము చేత; ప్రేఁతన్=ప్రేయుటను, ప్రేఁగు=కష్టము.

౭౮. లావు=అధికము; అంతరమందున్=మనస్సునందు; కష్టభాగులే=కష్టము నొందువారలే.

౭౯. నిజకులవర్తనన్ = తనకులముయొక్క ఆచారము చేత; రజము=కామును.

౮౦. ఒంటన్=మఱియొకచోట; కలిమి= కలుగుట; జాతి అంధునకున్ = పుట్టుగ్రుడ్డునకు, కన్నులులేనివానికిఁ జెవులున్నను అందుచే నధికలాభము కలుగనట్లు బంధువులవలన గౌరవము లేనివానికి ఇతరులవలన గౌరవమున్నను అది గొప్ప కాదని తా. మహాశంధిని = గొప్పసముద్రమునందు— సముద్రమునందు వర్షము గురియుటవలన ఫలము లేనట్లు ఇతరుల వలనిగౌరవముచే ఫలము లేదని తా.

౮౧. పిత = తండ్రియును; పితామహుండును = తాత

యును, మొదలగు పెద్ద లనుట. కల్యాణవిదుల్ = శుభము: దెలిసినవారు.

౮౨. బంధుసద్భావముల్=చుట్టాలయెడ మంచివృత్తిని; పూర్వపూరుషగతంబుల్ = మునుపటిపురుషులమార్గమును; కులోచితవర్తనల్= కులమునకుఁ దగినయాచారమును; సర్వధర్మసంభావనలు=సమస్తమైనధర్మమును గౌరవమును.

౮౩. అంతరవృత్తిల్ = మనస్సునందలి స్థితిని; బాహ్యము= వెలుపలిది; పెరిమను= గొప్పతనమును; కన్నచోటల్ = చూచినయెడ; నయకోవిదుల్ = నీతిశాస్త్రమునందుఁ బండితులు; ధిషణభార్గవముఖ్యులు= బృహస్పతి శుక్రుఁడు మొదలగువారు.

౮౪. దూరవర్తిజనులతోడి మెలంకువవలనల్ = దూరముననుండు జనులతో మెలంగువిధమువలన; ప్రకృతి=స్వభావము; ఆంతరంగికము = అంతరంగజనులతో సంబంధించినది.

౮౫. సతీసుతులతోడల్ = భార్యతోను కుమారులతోను; తార్కాణము=దృష్టాంతము.

౮౬. అంతరము=మనోగతమును; చిరంబును= బహుకాలము; ఇంతయుల్=కొంచెమైనను; తత్ ఫలదాతల్=ఆధర్మముయొక్కఫలము నిచ్చునట్టివానిని; సాధువులమన్నన = సత్పురుషుల గౌరవించుటను.

౮౭. కులముపాడి = కులముయొక్కధర్మమును; పుడమిల్=భూమియందు; వాసి=కీర్తిని.

౮౮. తతిల్ = సమయమునందు; వితథములై = వ్యర్థములై; అకాలవిహితములు = సమయము కానియప్పుడు చేయఁ

బడినవి; ఘనవర్గఆగతిఁ = గొప్పవర్షము వచ్చినప్పుడు—తగు సమయమున నాటక వర్షము గురియునపుడు నాటినవి త్తనము మొలవనియట్లు సమయమునఁ జేయక సమయము కానియప్పుడు చేసినకార్యములు వ్యర్థము లగు నని తా.

౮౯. సుతులకుఁ=కొడుకులకును కూఁతులకును.

౯౦. ఇంతి=ఆఁడుది; మేలుపఱిచి=గొప్పచేసి.

౯౧. స్మితంబు= చిఱునగవు; మృదుతరభాషణములఁ= మిక్కిలి మెత్తనిమాటలచేత; దయిత=భార్య.

౯౨. ఉజ్జగించి=విడిచి.

౯౩. చెలువలందుఁ= స్త్రీలయందు; ధర్మశీలంబులఁ= ధర్మమును మంచినడవడిని; మానితవాక్యము=పూజింపఁబడిన మాట.

౯౪. నీపంపు=నీయాజ్ఞను.

౯౫. ఆతనియిల్లు= మధుకరునియింటిని; ఆదటఁ = ప్రీతితోఁ; చేరిననాఁటఁగోలెఁ=చేరినప్పటినుండియును; నీయాలిత సత్గుణంబులమహత్త్వమునఁ = నీయధికము లయినమంచి గుణములగొప్పతనముచేత.

౯౬. సువృత్తమునందుఁఅ = మంచియాచారమునందే; నిత్యఉన్నతిఁ = ఎడతెగనిగొప్పతనముచేత; ఉద్ధతురాలవు= గర్వించినదానవు; నెఱితోఁడఁ = న్యాయముతోఁ; తుచ్ఛములఁ=అల్పములందు; భవనంబునఁ = ఇంటియందును; బంధుసమాజమందునఁ = బంధువులసమూహమునందును.

౯౭. నైజసత్భావముతోఁ = నీదైన మనస్సుతోఁ; మానినీమణీ=స్త్రీరత్నమా!

౯౮. వానికిన్ = ఆమధుకరునకు; భావములు = అభిప్రాయములు; సముంచితఅధికశ్రీనిధి=ఒప్పుచున్న గొప్పసంపదకుఁ జోటైనవాఁడు; లోకమానితవిశేషసమున్నతిన్ = జనులచేఁ బూజింపఁబడిన యధికమైనగొప్పతనమును; అర్తిలిన్ = ప్రీతితో.

౯౯. కరగ్రాహిపదమున్ = పన్నువసూలుచేయునధికారమును (డిప్టికలెక్టరుద్యోగమును); భువనస్తుత్యంబు=లోకముచేఁ బొగడఁదగినది.

౧౦౦. బహుజనసహవాసమునన్ = పెక్కుజనులతోఁ గూడియుండుటచేత; మహిన్=భూమియందు; లోకంబు హిత అహితగతులు = లోకముయొక్క మేలుగీడులవిధములు; అనవహితమతి=చొచ్చుదల లేనిబుద్ధి గలవాఁ డగు.

౧౦౧. న్యాయ్యములు = న్యాయముతోఁ గూడినవి; న్యాయఅపేతములు=న్యాయమునుండి తొలఁగినవి.

౧౦౨. కాదు = ఫలము నియ్యదు; వీరు — మధుకరుని పక్షమువారు, ఆదిన్ = మొదట; అది = ఆకర్మమును; ఆపాదిల్లదు=కలుగదు—వేదోక్తకర్మము చేసిననే గాని దానిఫలము గలుగదు, కావున వీరు దాని నాచరింపక దానికి ఫలము లేదనుట యుక్తము గాదు, దానిఁ జేయనివారికి ఫలం బున్నదో లేదో యెట్లు తెలియు నని తా.

౧౦౩. హేమంతంబునన్ = పౌషమార్గశీర్షమాసములయందు.

౧౦౪. విభవఉద్భాసితులు = సంపదచే నొప్పినవారు;

అభయవ్రీడాఅభిమానులు = భయమును సిగ్గును అభిమాన మును లేనివారు.

౧౦౫. గతి= దారి; అన్యంబు = వేఱు; అటవీమధ్యంబు నన్ =అడవినడుమ; కదురన్ =అధికముగా–అడవిలో వెన్నెల గాచుట జనానందము లేకపోవుటవలన నెట్లు వ్యర్థమో అట్లు బంధువులమన్నన లేనిసంపదలు వ్యర్థము లని తా. కారిం చెడిన్ =బాధించుచున్నది.

౧౦౬. అతఁడు – మధుకరుఁడు, వానిసంగతిన్ = మధు కరునిసహవాసముతో; సాధుజనతాగర్హ్యుండనై = సత్పురు షులసమూహముచే నిందింపఁదగినవాఁడనై; దానిన్ – వాని సహవాసమును, ఏర్చున్ =దహించును.

౧౦౭. తాన్ – మధుకరుఁడు, అవ్వారవు = ఆవిధమును; మహాప్రాజ్ఞులు = గొప్పపండితులు; ఇద్ధరలోన్ = ఈభూమి యందు; దుష్కరముల్ =చేయుటకు కష్టమయినదియు; బహు ద్రవిణసాధ్యంబు = ఎక్కుడుధనముచే సాధింపఁదగినదియు; నేరఁగాన్ =ఎఱుంగుటకు.

౧౦౮. విహితఆచారము = శాస్త్రముచేఁ జెప్పఁబడిన యాచారము; మేకొందుర్ = పూనుకొందురు; వారిపూన్కి = వారియత్నము; భావిఅర్థము=భవిష్యద్విషయమును; అర్థిన్ = ప్రీతితో.

౧౦౯. ఖ్యాతుఁడు=ప్రసిద్ధుఁడు; పూతము=శుద్ధము.

౧౧౦. వేదవేదిశీలవిలసితంబు = వేదములచేతను త్రేతా గ్నులనుంచు తిన్నెచేతను (యజ్ఞముచేతను) సదాచారము చేతను ప్రకాశించుచున్నది.

౧౧౧. ఆర్యజనక్షుణ్ణము = పెద్దలచే త్రొక్కఁబడినది; సత్ పథంబునన్ అ= మంచిమార్గమునందే; తలఁగి= తొలఁగి; ఆడికోలు= నింద; మనుమార్గమును= మనువుయొక్క దారిని, మనువు చెప్పినదారి ననుట.

౧౧౨. కృతఉపనయనునిన్ = చేయఁబడినయుపనయనము గలవానిఁగా.

౧౧౩. తాల్మిన్ = ఓపికతో; సుశీలున్ = మంచినడవడి గలవానిని; గుణశ్రుతఆఢ్యున్ = గుణములచేతను విద్యచేతను ఒప్పినవానిని; వీఁడనే= తెలివిమాలినవాఁడనా?

౧౧౪. మంతనంబున్ = ఆలోచనమును; నెఱి= న్యాయము; గణ్యున్=గణింపఁదగినవానిని, ఉత్తముని; తడవంగన్= వెదకుట.

౧౧౫. ప్రాప్తకాలంబు=పొందఁబడినకాలము గలది.

౧౧౬. ఆంగ్లవిద్యాపరిశ్రమము = ఇంగ్లీషుచదువునందభ్యాసమును; విలంబము = ఆలస్యము; ప్రాప్తఅవసరము= పొందఁబడినకాలము గలది.

౧౧౭. అర్హవిధమునన్= తగినవిధముచేత; చనవు=అధికారమును; విశ్వాసమునన్=నమ్మకముతో.

౧౧౮. దొరఁకొనవు = యత్నింపవు; సుతాపరిణయమునకున్=కూఁతుపెండ్లికి.

౧౧౯. ఆంగ్లేయకలానిధి= ఇంగ్లీషువిద్యకు గని యయినవాఁడు; వినయఆభరణుండు=అడఁకువ సొమ్ముగాఁ గలవాఁడు; వేదవేదికులమునన్ = వేదముల నెఱిఁగినవంశమునందు; విశ్రుతచరిత్రుఁడు=పొగడఁబడిన నడవడి గలవాఁడు; మన వేద

కమలోదరునిఁ = మన వేదనాథునికుమారుఁ డగుకమలో దరుని; కనవే=ఎఱుఁగవా ?

౧౨౦. కమలోదరుఁడుల = కమలము కడుపునందుఁ గల విష్ణువే, కమలము జన్మస్థానముగాఁ గల బ్రహ్మయే; విమల ఆకారమునఁ=నిర్మలమయినరూపమునందును; వితతవిద్యను= గొప్పచదువునందును — రూపమున విష్ణు వనియు చదువున బ్రహ్మ యనియు తా.

౧౨౧. తత్ప్రియసుతుండు= వాని కూరిమికుమారుఁడు, కమలోదరుండు; శీలవిద్యలఁ = సదాచారమును చదువును; మణియుఁ బసిండిఁబోలెఁ=రత్నమును బంగారమునువలె.

౧౨౨. అగ్రసుతుఁడు= మొదటికొడుకు; అగ్రపదముఁ= మొదటిస్థానమును.

౧౨౩. అన్వర్థనామధేయుఁడై = అర్థముతోఁ గూడిన పేరు గలవాఁడై; మనోరమరూపధేయుఁడు=మనోహర మైన రూపము గలవాఁడు.

౧౨౪. ఆంగ్లేయవచఃస్ఫూర్తిఁ= ఆంగ్లభాషయందుఁ బ్రసిద్ధిని; సుచరితులు = మంచియాచారము గలవారు; శుభఆకారులు= మంచిరూపము గలవారు; స్వీకరింతుఁ = అంగీకరింతును.

౧౨౫. తప్పినవారిఁ — కాలమునందుఁ జేయనివారిని జూచి మనకుమాత్రము చేయనియెడ నేమితప్పు అని తలఁచి యధర్మమునం బడుదు మని తా.

గ్న ౧౨౬. అభ్యున్నతకుడ్యముఁ=పొడుగైనగోడను.

చేతగ ౨౭. చిన్నెలఁ=లక్షణములచేత; సంగతము= తగవు.

౧౨౭. ఒందుచోఁ=మఱియొకప్పుడు; లాఘవ=సౌఖ్యము— ఇప్పుడు చేయనియెడ ఎప్పుడును ఈవిధముగానే పనులుండును గావున మఱి యొకప్పుడు చేయుట సులభ మని తలంపరా దని తా. అదనఁ= సమయమునందు; ఆవిలంఘించి= కలఁతపెట్టి; లోఁచి= లోఁబఱిచి; ప్రౌఢిఁ= పరాక్రమముచేత — ధర్మము నాచరింపవలయు ననునెడ దాని నెప్పుడు చేయవలయునో ఆ సమయమునందే తప్పక చేయవలయును, తప్పినయెడ అధర్మము విజృంభించి మనుష్యుని తనకు లోఁబడునట్లు చేయు నని తా.

౧౨౮. విమలగుణశీలయుక్తులు = నిర్మలము లయినగుణములతోను సదాచారముతోను గూడినవారు; అసమవిద్యులు=సాటిలేనిచదువు గలవారు.

౧౩౦. సూరెలఁ = ప్రక్కలను; సునిపుణమతులై= మిక్కిలి సమర్థమైనబుద్ధి గలవారై; వారిచి=వేచి; సత్చారిత్రముఁ=మేలినడవడియు.

౧౩౧. అట్టిది — అట్లు తండ్రులు కొడుకులను దమతో నుంచుకొనుట. కట్టు= నీతిని; కట్టుఁ = వస్త్రమును; నెట్టన= అనివార్యము; నెఱి=న్యాయమును.

౧౩౨. మందతఁ = మూఢతచేత; కుటిలచరితకుఁ = చెడ్డనడవడివలన.

౧౩౩. సుదూరము = మిక్కిలిదవ్వు; టెంకికిఁ = స్థలమునకు; నియతిఁ=నియమముచేత.

౧౩౪. ఐనఁ = వరులు దొరకుపక్షమున; అకారణముగఁ=కారణము లేక.

౧౩౫. అర్థిలిఁ=ప్రేమతోఁ; గీమునకుఁ=ఇంటికి; పర
కీయుఁడు=పరాయివాఁడు; లాఁతివిలాతిజాతి=ఇతరదేశపుజాతి
వాఁడు; తాఁ=మధుకరుఁడు; ప్రేముడిఁ=ప్రీతితోఁ; పిలఁ=
పిలువఁగా; దురంతకోపముఁ=అధిక మయినకోపమును.

౧౩౬. గాఢమదఉద్ధతుఁడవు = ఎక్కుడు కావరముచే
గర్వించినవాఁడవు; నికామక్రోధఆలీఢమనస్కుండయి=ఎక్కు
డుకోపముచే వ్యాపింపఁబడినమనస్సు గలవాఁడై; అనిగూఢ
ముగాఁ = ప్రకాశముగా, అందఱు వినునట్లు; బిట్టు = వేగ
ముగా; కూరిమి=ప్రేమ; తఱుఁగఁ=నశించునట్లు.

౧౩౮. అదీన=ధైర్యము గలది; ఈకొనక=అంగీకరింపక.

౧౩౯. అతిమృదులము = మిక్కిలి మెత్తనిది; మెయి
కొని=సమ్మతించి; దయారహితుండు=కనికరముచే విడువఁబడిన
వాఁడు.

౧౪౧. తనూజ = కూఁతురు; చరిత = ఆచారము; కా
నిది=తగనిది.

౧౪౨. అంతఁ=మానవతి యట్లు చెప్పినపిమ్మట; లేక=
జాబుఁ; ఏకమతిని=ఒకటేబుద్ధితో.

౧౪౩. అక్కజముగ = ఆశ్చర్యముగా; వెక్కసము
నఁ=సహింపలేమిచేత; ఉద్ధతిఁ=కోపముతో.

౧౪౪. ధర్మ ఏకనిష్ఠతోఁ = ధర్మమునందే ముఖ్యమైన
యునికితో; మెయికొనియెఁ= పూనెను; చూఁడువ్రాఁతలు=
దహించుమాటలను.

౧౪౫. సాకతము = అనుగ్రహము; పోకలు = కపటపుఁ
జేఁతలు.

౧౮౬. వాపఱుపు= నాగారవమును; ఏపునన్ = విజృంభ ణముచేత; హీనవిధమునన్ = నీచవిధమున; ట్రోపాడినన్= నెట్టినను; ప్రోపులయి=పుష్టి గలవాఁడై.

౧౮౭. నిర్మర్యాదుండు = కట్టుమీఱినవాఁడు; నీతిరహితుఁడున్=నీతిచే విడువఁబడినవాఁడును.

౧౮౮. వేమఱు = పలుమాఱు; అంబేదలు = దీనులు; గాఢమూఢులు=మిక్కిలి తెలివిమాలినవారు; దుర్మదుండు= చెడుకావరము గలవాఁడు; దినకృత్తు—దినకరుఁడు, విత్త్వము= పాండిత్యము; నుడులు=మాటలను; వేడబంబునన్=మోసము చేత.

౧౮౯. నీకున్; ఇమ్ము=ఆనందము; నాన్=అని చెప్పఁగా; లోఁచుతనుడులు = లోఁబఱచునట్టి యీమాటలను; తమోలోలత్వంబునన్ = అజ్ఞానమునం దాసక్తు లగుటచేత; మగ్నులు=మునిఁగినవారు; స్వదృక్పాత్రము = తమచూపునకు విషయము; చూడఁబడునది యనుట.

౧౯౦. అదృష్టమె = కనఁబడనిదై; ఇహంబు = ఈలోకమును; దృష్టము=కనఁబడినదానిని; కోలుపోవ్రన్=పోఁగొట్టుకొనును; దుర్లలితపుతవిధిన్=చెడ్డది యగు నీన్యాయముచేత; మోసముపోయి నిజకులంబునుమోసపుత్రు—కొందఱు తాము మోసపోయి తమకులమునుగూడ మోసపోవునట్లు చేసెదరని తా. ఇలన్ = భూమియందు; అంగనా — మృదుభాషిణి సంబోధనము.

౧౯౧. బూది=విభూతిని; అద్విజాతతదులు= శూద్రులు మొదలగువారు; వారికిన్ = అశూద్రులు మొదలగువారికి;

మై= దేహము; కరంబు=మిక్కిలి; మలినంబు= మైల; నిహీనతన్=మిక్కిలి నీచతను.

౧౫౩. కుడువన్ = తినుటకును; తొడువన్ = సొమ్ములు ధరించుటకును; కట్టన్=వస్త్రము కట్టుకొనుటకును; పెంపు= గొప్పతనము; ఏది = నశించి; ఆత్మవృత్తికై = తమజీవనము కొఱకు; వేసరి తమముగంబున వేసినన్ = గృహస్థులు విసిగి తమ మొగముమీఁద వేసినను; కాదు అనక = తగదని తలంపక; ఆదటన్ = ప్రీతితో; గ్రహింత్రు = పుచ్చుకొనుదురు; ఆదృతిన్ = ఆదరముచేత; దయ్యముఎత్తికోలునన్ = దైవయత్నముచేత.

౧౫౪. ఏమిచదువుం జదువన్ పోఁడిమి నేరరు= ఒప్పిదము నెఱుఁగరు; నాగరత్వపుంబాడి = నాగరతయొక్క విధమును; గరిమన్=గొప్పతనమును; తరమున్=మానమును; కనుతీరు= పొందువిధము; ఈవేడబము=ఈకపటము; విడంబనము=వేషము; వెక్కసము = దుస్సహము; ఈబూడిదవేఁతమూతులకున్ = విభూతి ధరించినముఖము గలవారికి, కమలోదరపురుషోత్తములకు; నేతునే=నేర్తునే.

౧౫౫. కార్పణ్యమునన్ = కుత్సితత్వముచేత; దుర్వహమునన్=ఓర్వఁజాలనియట్లు.

౧౫౬. అనుజన్మునియందునున్ = తమ్మునియందును; ఉడికిల్లెడు=ఉడుకునట్టి.

౧౫౭. హృదయదయితుపీనులకున్=భర్తయొక్క చెవులకును; తనరు మృదుమధురసుభాషితంబులన్ = ఒప్పునట్టి మెత్తని తియ్యని మంచిమాటలచేత.

౧౫౮. సమానోదర్యునెడన్ = తమ్మునియందు; మానంబు=గౌరవమును.

౧౫౯. సోదరుకన్నను= తోఁడఁబుట్టువుకంటె; వాదున్=జగడమును; సాదుతనంబు = మంచితనమును; పొందుసౌఖ్యంబు=స్నేహసుఖమును; అనఘా=పాపము లేనివాఁడా !

౧౬౦. ఒకమరి=ఒకసారి; కలంకంబు=దోషము, ముఱికి; స్నేహఉదకములన్=చెలిమియను నీళ్ళచేత; భ్రాతృధర్మము=తోఁడఁబుట్టువులధర్మమును.

౧౬౧. తురకవజీరుతోన్ = తురకప్రభువుతో; దేవరుఁడు=మఱఁది; మందిరము=ఇంటిని.

౧౬౨. పూతఆచారపరుండు = పవిత్ర మయినయాచారమే ప్రధానముగాఁ గలవాఁడు.

౧౬౩. హితఅహితములు= మేలుగీడులను; వెరవునన్=ఉపాయముచేత; మహిన్=భూమియందు; మహితున్=గొప్పవానిని.

౧౬౪. ఒప్పరికింపక = ఉపేక్షింపక; ఉరవు = ఔచిత్యమును; వెరవు=యుక్తిని.

౧౬౫. ఉన్నఅంతయున్ = ఉన్న దానినంతను; ఉరవువ=ఉచితమా ? ఇచ్చన్=మనసునందు; నచ్చుట=నమ్ముట.

౧౬౬. విదితము=తెలిసినది; విహితంబు=చేయఁబడినది.

౧౬౭. గోత్రఅలంకారంబుగన్ = వంశమున కలంకారమగునట్లు; మైత్రిన్ = మిత్రభావమును; తేజు = కాంతి; మనుగడకున్=బ్రతుకునకు.

౧౭౦. సదములన్= సభలయందు; ముదితను = సంతో

పించినదానను; ముదితను = స్త్రీని, తెలియనిదాన ననుట.
నీదుతియ్యనిముదలనుదక్క_ = మీమధుర మయినయాజ్ఞ
చేతనేగాని.

౧౭౧. వేదుఱు=పిచ్చి; ఆదలు=చింతలను.

౧౭౨. తిలకము=బొట్టు; వగ=అందము; మొగులు=మే
ఘము; నెలన్ = చంద్రుని; ఆవరించినగగనముగతిన్ = కప్పిన
యాకాశమువలె; చెన్నుతఱఁగి=అందము చెడి.

౧౭౩. వదనకమలంబునన్ = కమలమువంటి మొగము
నందు; మీశుభఆకృతి=మీమంగళకర మయినయాకారము.

౧౭౪. శరద్భవసిలఉల్లసితము=సుఖము నిచ్చునట్టి విభూ
తిచే ప్రకాశించునది; భర్మఅబ్జనిభంబు = బంగారుతామర
వంటిది.

౧౭౫. మెచ్చుగన్=అధికముగా; నచ్చినదానన్=నమ్మిన
దానను; డెందము=మనస్సు; సతంబే=నిత్యములా ?

౧౭౬. కన్నారు=పొందినవారు; వినుతచరితంబు=మంచి
యాచారము; మలినదర్పణములవిధమునన్ = మురికియైన
యద్దములవలె.

౧౭౭. పీడంగన్ = స్పష్టముగా; పీఁపుదరిన్ = వెన్నుప్ర
క్కను; వాపోకలన్=ఏడుపులను; అఁపన్=అడఁచుట.

౧౭౮. బందుగులపొందు= చుట్టములస్నేహము; డిందిన
చందంబై = నశించినట్లు; మందిరమువంకన్ = ఇంటివైపున;
ఏ తేరు=రారు.

౧౭౯. వెరవుపది=వగచెడి; గరువంబుజీ= గొప్పతనము
చెడి.

౧౮౦. వాయనువు=నావిధమును.

౧౮౧. అన్యోన్యకృతప్రేమఅనుబంధలు = ఒండొరుల యందుఁ జేయఁబడినస్నేహసంబంధము గలవారు.

౧౮౨. క్రచ్చుఅర్ = శీఘ్రముగా; తొచ్చులకుర్ = నిందలను.

౧౮౩. కందుల్=దోషములను.

౧౮౪. కోమరులమురువు = కొడుకులచక్కఁదనమును; కులనియతియఅర్ = కులాచారము చెడునట్లు; అమందతత్ ఛందవశవిహారరసికులై= తక్కువకానివారియిష్టముచొప్పున విహరించుటయందుఁ బ్రీతి గలవారై.

౧౮౬. అపారవ్యాసారవారపారీణులరై = కడలేనికార్యములసమూహము తుదముట్టినవారై; కారించెడునాయేరు = బాధించునట్టి నాతలనొప్పిని.

౧౮౭. పొదలఅర్ = వృద్ధినొందునట్లు; ఇష్టమృష్టఅన్నంబుల్=ప్రియము లైనయుత్తమము లగు అన్నములను; తొడి= సొమ్ములుదాల్చి; కట్టఅర్ = వస్త్రములుధరించుటకు; అంపఅ ఇది=ఈబాణములసమూహము; నొవ్వ=నొప్పిని.

౧౮౮. ఆముద్దియ=ఆస్త్రీ, మృదుభాషిణి; బాష్పఅమల బిందువులఅర్=కన్నీటినిర్మలము లైన బిందువులచే; దయితులంఘ్రిలఅర్ = పెనిమిటిపాదములను; తడిపెర్ — నమస్కరించె ననుట.

౧౮౯. సంతప్తచిత్తుఁడై= మిక్కిలి తపించినమనస్సు గలవాఁడై; హృదయదఃఖితశోకము= భార్యయొక్కదుఃఖమును;

ఎదన్ = మనస్సున; అబలన్ — భార్యను; అశ్రుకణములు = కన్నీటిబిందువులు.

౧౯౦. ఇంపు=ప్రియము; సరోజనయనా= కమలములవంటికన్నులు గలదానా! ఎలమిన్=సంతోషముతో.

౧౯౧. కూర్చిన=ప్రియమైన; ఇందునిభఆస్యా=చంద్రునితో సమానమయినముఖము గలదానా!

౧౯౨. వీడనాడక = స్పష్టముగాఁ జెప్పక; ఈతోరపు వ్యసనభరమున్ = ఈగొప్పదుఃఖముయొక్కయతిశయమును; ఈప్రాఁతికిన్=ఈప్రేమకు.

౧౯౩. ఏఁకటన్= మిక్కిలి యపేక్షతో; నీకూరిమి= నీప్రేమను; నళినదళాక్షీ = తామరఱేకులవంటికన్నులు గలదానా.

౧౯౪. కాదు=అప్రియము; పాయుదున్=విడుతును.

౧౯౫. విపరీతము=తప్పైనది.

౧౯౬. సుతులకున్=కొడుకులకు; సుతలకున్ = కూఁతులకు; పరిణయములు = వివాహములను; బడి=క్రమము; అవిలంబితముగన్ = శీఘ్రముగా; వితాకున్ = దుఃఖపరవశతను; వితగాన్=వ్యర్థముగా.

౧౯౭. ఉపభుక్తము=అనుభవింపఁబడినది; స్రజమును=పూదండను; పవిత్రచరితలలోనన్=పరిశుద్ధములయినయాచారము గలస్త్రీలలో.

౧౯౮. అక్కునన్=ఱొమ్మున; నిజఅంశుకంబునన్ = తన వస్త్రముచేత; నెయ్యంబునపేర్మిన్ = స్నేహముయొక్కయతి

శయముచేత; దేహము—దేహము మాఱకున్నను క్రొత్తసుగుణములనొంది మధుకరుఁడు క్రొత్తవాఁ డయ్యె నని తా.

౧౯౯. కనవలయున్=అనుభవింపవలయును; కాంతవగపునన్=ప్రియురాలిదుఃఖమునందు; అనలంబునన్—నిప్పునందు బంగారమువలె కరఁగి నిర్మలుం డయ్యె నని తా.

౨౦౦. అంతఃకరణతరంగములు=మనస్సునందలి కరుళ్లు, అనేకము లైనతలంపు లనుట. చింతాదంతురితలలాటుఁడు= విచారముచే మిట్టపల్లముగాఁ జేయఁబడిననెత్తి గలవాఁడు.

౨౦౧. నానయనములు = నాకన్నులు; విచ్చెన్ — నాకిపుడు సత్యము తెలియవచ్చె నని తా. నలినాక్షి = కమలములవంటికన్నులు గలదానా! వగన్ = దుఃఖమును; ఎడకున్=మనస్సునకు.

౨౦౨. అభీరువు= భయము లేనిది; నవఅబ్దముక్తఅమలధారను = క్రొత్తమేఘముచే విడువఁబడిననిర్మల మయినజలధారను; వాక్‌విలాసంబునన్ = మాటలయతిశయముచేత; అన్న=స్త్రీ; ప్రకృతిన్ = స్త్రీస్వభావమును, భయము లజ్జ కలిగియుండుట ననుట.

౨౦౩. అమాన్య = అపూజ్యురా లగు మృదుభాషిణి; అమందప్రేమయున్=అధిక మయినయనురాగమును.

౨౦౪. ప్రకృతిమధురంబు = స్వభావముచే మనోహరము; సుకృతఅభివృద్ధశోకంబుకతనన్= పుణ్యముచే వృద్ధినొందిన దుఃఖమువలన.

౨౦౫. వెలఁది—మృదుభాషిణి; అంకతలంబునుండి= ఒడినుండి; దయితఆననమందున్=మగనిమోమునందు; నవఆర్ద్రి

శరద్శోభనము = క్రొత్త తడిసినకమలములవలె సుందరము, కన్నీరుండడిసిన దగుటచే ననుట. మరందసారహరణఅతివిదగ్ధములు=తేనెయొక్కయతిశయము హరించుటయందు మిక్కిలి నేర్పు గలవి; సుఉక్తుల౯=మంచిమాటలచేత.

౨౦౬. పైకొనుట= అతిక్రమించుట; నాతికి౯ = స్త్రీకి; హృత్ ఈశా=మనోనాథా!

౨౦౭. తత్ వాచికము = ఆసమాచారమును; కమ్మ = జాబు; గ్రమ్మన౯ = శీఘ్రముగ.

౨౦౮. తరమో=శక్యమో; విలంబనము=ఆలస్యము.

౨౧౦. దీపిక=దీపము, ఇంటికి ప్రకాశము కలిగించునది యనుట. అకా౯=అని.

౨౧౧. కానిది=తగనిది; చిన్నారిగుణము = చక్కనిగుణము; విన్నంబడుపకుండు = దుఃఖమునొందునట్లు చేయకుండు.

౨౧౨. కూర్చి=ప్రియమై; అన్యూనము=గొప్పది; సుశీలనెయ్యములోనై = సుశీలయొక్క స్నేహమునకు వశమై; అందు౯ =నిరకరునింటను; ప్రమదలోలత౯ = సంతోషమునందు ఆసక్తయగుటచేత.

౨౧౪. పురుషఉత్తముతో౯అ=విష్ణువుతోనే; పురుడు= సమానుండు; పుడమి౯ = భూమియందు; అరయంబడులక్షణములు=వెతకంబడుగుణములు.

౨౧౫. అమితఆనందము౯=కొలదిలేని సంతోషమును.

౨౧౬. అపగతవిమోహతను = పోయినయజ్ఞానము గల దగుటచేత; ప్రతిలేఖ౯=బదులుజాబును.

౧౧౮. అందుఁ = ఆజాబునందు; అనునయించి = ఊఱడించి; నందనకుఁ = కూఁతునకు; తనదుపొందుఁ = తనసమ్మతిని.

౧౧౯. అంతటఁ = అన్ని స్థలములందును; మంతనము = ఆలోచనమును; మనువులను = వరులను.

౧౨౦. నందనులకుఁ = కొడుకులకు; నందితబుధసత్సందోహంబుగా = సంతోషపెట్టఁబడిన పండితులయు సత్పురుషులయు సమూహము గలుగునట్లు; కుందరదన = మొల్లలవంటి దంతములు గలదానా!

౧౨౧. ద్విజాగ్రసరుఁ = బ్రాహ్మణోత్తముని; అర్థి = ప్రీతితో; నిజఇష్టము = తనకోర్కిని; సౌమ్యవీక్షితంబును = శుభగ్రహములచేఁ జూడఁబడినదానిని; బహుమోదముఁ = గొప్ప సంతోషమును.

౧౨౨. హితలాలసుఁడై = మేలునందాసక్తి గలవాఁడై; భగ్నము = చెడినది; భుగ్నము = వక్రము; ఉద్విగ్నత = వ్యసనము; విన్ననువు = నేర్పు.

౧౨౩. చింత = దుఃఖమును; అభిమానము = పరువును; దైన్యము = అవమానమును; సందడింపఁగా = హెచ్చఁగా; విధుతమనస్కుఁడై = చలింపఁజేయఁబడినమనస్సు గలవాఁడై; బుధవర = పండితోత్తమా!

౧౨౪. ఈమండలమునఁ = ఈదేశమున; దవ్వులకుఁ = దూరదేశమునకు.

౧౨౫. నయశీలురు = నీతియె స్వభావముగాఁగలవారును; ధీమంతులుఁ = బుద్ధిమంతులును; పనిగొనుమా = నియోగింపు

మా! మయిమయిన్ = అనాయాసముగా; అప్రమాదంబుమెయిన్=ఏమఱుపాటు లేమిచేత.

౨౨౬. తత్కార్యసాధననైపుణ్యము=ఆకార్యము సాధించుటయందు నేర్పు; తత్సాన్నిధ్యమున్= ఆమధుకరునిసమీపమును; సద్యఃప్రీతుఁడై=ఆక్షణమె సంతోషించినవాఁడై.

౨౨౭. శుభఆకృతిన్=చక్కనిరూపమునందు; ఆభారతికిన్=ఆసరస్వతికి; ఆకల్యాణులకున్ = ఆమంగళరూపిణులకు; కల్యాణంబుల్=వివాహములు.

౨౨౮. తత్సుదతులతోడన్ = ఆ యాంగ్లేయస్త్రీల యొద్ద; సాంతము=కడవఱకు; అదయతన్=దయలేనివారగుట చేత; అనుదారమనస్కతన్ = నీచ మయినమనస్సు గలవారగుటచేత; పొందు=స్నేహము; లేవడిన్=లేకుండుటచేత.

౨౨౯. కొండొకదానికిన్=చిన్నదానికి.

౨౩౦. విద్యావిచక్షణులను= చదువునందు నేర్పరులను.

౨౩౧. అమ్మేటి=ఆయుత్తముఁడైనమధుకరుఁడు.

౨౩౨. మీయాదేశంబు=మీయాజ్ఞను; మీయర్థంబు= మీకార్యము; మోదంబు= సంతోషమును; ఆదూత్యజ్ఞులు= దూతకృత్యము నెఱింగినయాపురుషులు; అత్యంతసంతుష్టుఁడై=మిక్కిలి సంతోషించినవాఁడై.

౨౩౩. వ్యయమునకయి=సెలవుకొఱకు.

౨౩౪. వీడుకోలు=సెలవుపుచ్చుకొనుటను; తడవుచున్= ప్రస్తావించుచు.

౨౩౫. నెలఁత = స్త్రీ; ఎలమి = సంతోషము; కూర్పునిపుణుఁడు=ప్రియుఁడైన నేర్పరి.

౨౩౬. కాతర్యము=భయము.

౨౩౭. కులముపాడి= కులధర్మము; పెంపు = గొప్పతనము; అన్నుమిన్న=స్త్రీరత్నమా!

౨౩౮. వేదవిధి = వేదముయొక్కయాజ్ఞ; అలంకృతాంగిఁ = అలంకరింపఁబడినదేహము గలదానిని; వటునేతకుఁ= బ్రహ్మచారిశ్రేష్ఠునకు; సంపన్నత = సంపదగలవాఁడగుట; బంధుసమాజమునందుఁ= చుట్టాలసమూహమునందు; గర్హణఁ=నిందను.

౨౩౯. దాపునఁ = సమీపకాలమునందు; తామరసాక్షీ=తామరలవంటికన్నులు గలదానా!

౨౪౦. సమ్మోదము = సంతోషము; ఉత్తలపడుచుఁ= శ్రమపడుచును; అకలంకతఁ=దోషము లేమిచేత.

౨౪౧. అవుగాములఁ=యుక్తాయుక్తములను; ఉదర్కశోకముఁ= భవిష్యత్కాలపుదుఃఖమును; తవఁ= తగునట్లు; దరిఁ=పారమును.

౨౪౨. ద్విజఅన్వయదీపుఁడు = బ్రాహ్మణవంశము ప్రకాశింపఁజేయువాఁడగు; మిత్త్రతతి = స్నేహితులసమూహము; ఇయ్యింతియుఁ—ఈ నీతల్లియును.

౨౪౩. స్వహితము = తమమేలును; తద్విధంబు గాక తప్పినఁ— అట్లు గాక వారు తామే తమమేలు నిశ్చయించుకొనునెడ; ఉభయలోకజసుఖములు= రెండులోకముల (ఇహపరముల) యందుఁ గలుగుసుఖములను; కోలుపోవుదురు = పోఁగొట్టుకొందురు; నిక్కువము=సత్యము.

౨౪౪. ఉత్‌మదము = అధిక మయినమదము గలది;

సమాహితభావముచే = నిశ్చలవృత్తిచేత; తత్ అనంతరసౌ
ఖ్యము = ఆవెంబడి గలుగుసుఖమునె; ఆదరు = చలనమును;
తొలంగి= విడిచి; దీర్ఘపుడదర్కసుఖంబు= దీర్ఘమయిన భవి
ష్యత్కాలపుసుఖమును; వార్వఁగన్ =నిరీక్షించుటకు.

౨౮౫. లసత్ గుణాఢ్యతరున్ = ప్రకాశించుచున్న గుణము
లచే నధికుఁడైనవాని.

౨౮౬. కితవులు=మోసగాండ్రు; వెరవిఁడి=ఉపాయము
తెలియనిదానవు; పొగులంగన్ =దుఃఖించుట.

౨౮౭. పలువలయుక్తివమునన్ = దుష్టులమోసముచేత;
లోఁగి=లోపడి; ఏతత్ అన్యభూములన్ = ఈ దేశమునందును
ఇతర దేశమునందును.

౨౮౮. భూతిన్ = సంపదచేత; నీసమానలలోన్ = నీసరి
యోఁడువారిలోపల; తపనీయఆభరణఆచ్ఛాదవాహనఅర్థము
లు=బంగారుసొమ్ములను బంగారుచీరలను బండ్లను ధనమును,
తొడికట్టుటకు సొమ్ములను చీరలను తిరుగుటకు బండ్లను సం
పదచే మెఱయుటకు ధనము నని క్రమాన్వయము.

౨౮౯. నోవు=నొప్పి.

౨౯౦. యౌవనఅంకురవిలాసఆయతసాయకము = యౌ
వనప్రారంభముయొక్క విలాసము అను నిడుపైన బాణము.

౨౯౧. శైలంబుల=శీఘ్రముగానే; అలంబు=ఉపేక్షను;
అంబుజనయనా=కమలములవంటికన్నులు గలదానా!

౨౯౨. సదృక్ వామాక్షులలోన్ = సమానులగుస్త్రీల
లో; సోమఆనన = చంద్రునివంటిమోము గలదానా! మేలు
బంతిసొబగున్ =ఉత్తమ రాలియందమును.

౨౫౩. జాతస్ఫురితఓష్ఠనవప్రవాల=పుట్టినయదరులు గల క్రొత్తచిగురువంటి పెదవి గలది; కనత్ ఈషత్ రక్తిమంబు = ప్రకాశించుచున్న కొంచెము ఎఱ్ఱదనము.

౨౫౪. ఇనసముదయభాసురకోకనదఆభంబై = సూర్యోదయమునందుఁ బ్రకాశించుచున్న యెఱ్ఱదామరకాంతివంటి కాంతిగలదై, కోపముచే నెఱ్ఱఁబాఱినదై యనుట. జననికటాక్షకువలయజనితంబై = తల్లి యొక్క కలువవంటికటాక్షముచేఁ బుట్టింపఁబడినదై; సుస్మితఇందుచంద్రిక = చంద్రునివంటి చక్కనిచిఱునగవుయొక్క కాంతి, తల్లికటాక్షముచేఁ గోపమింపుక యడంపఁబడినందున యత్నమునఁ జిఱునగవు గలదై యనితా.

౨౫౫. కదురుకినుక = అతిశయించుకోపము; మగువమనము= కమలయొక్క మనస్సును; కాఱించెన్ = బాధించెను.

౨౫౬. అశ్రులు = కన్నీళ్లు; సంతతముగన్ = ధారగా; తెఱవ—కమల, వంతయున్=దుఃఖమును; వమ్ము=వ్యర్థము.

౨౫౭. ఆలంబు=ఉపేక్ష.

౨౫౯. కానిదానన్ =శత్రువైనదానను; కానన్ పోలెన్ = అడవియందువలె; ఉరవు=ఉచితము.

౨౬౦. మేరి— ఒక యాంగ్లేయకన్యక, ఆలస్యాకిన్ — ఆ మేరికి, కడమను=తక్కువను.

౨౬౧. బేలనే=మూఢురాలనా ?

౨౬౨. ఉవిదలు= స్త్రీలు; నందనన్ = కూఁతును; పేఁచునె=బాధించునా? తండ్రీ—సంబోధనము. నాసవతున్ = నా సమానము; భవనము=ఇల్లు; కంటకఆవృతము=శత్రువులచేఁ

జుట్టఁబడినది, ముండ్లచేఁ జుట్టఁబడినది; కేతకికిన్ = మొగిలి పువ్వునకు; వసుంధరన్=భూమియందు—మొగిలిపూవును అం దఱును శిరస్సున ధరింతురు, అయినను దానియున్నచోటు ముండ్లుగలది, అట్లు నన్నును అందఱును గౌరవింతురు, ఇంట మాత్రము మీరు శత్రువులుగా నున్నారు, కావున మొగిలి పూవును నేనును సమానల మని తా.

౨౬3. అత్యంతకోపఆర్తుఁడై = మిక్కిలి కోపముచేఁ బీ డింపఁబడినవాఁడై; నీయనర్గలవచఃధారావిలాసంబు=నీయొక్క యడ్డులేనిధారవంటి మాటలయొక్కవిలాసమును.

౨౬౪. ఆర్తుఁడు = దుఃఖము నొందినవాఁడు; అనునయ వాక్యముల్= ఊఱడింపుమాటలు; వరఆనయనార్థము= వరు లను దెచ్చుకొఱకు.

౨౬౫. ఏకతమందున్ = ఏకాంతమునందు; ఏకతము = ఆలోచనను; అస్తోకమనీషుఁడు = అధిక మైనబుద్ధి గలవాఁడు; నృపతుల్యమహాప్రభువంద్యుఁడు = రాజులతో సమాను లగు గొప్పప్రభువులచే పొగడఁదగినవాఁడు; పెల్లిదము= అతిశయ మును; తీర్పరిన్ = బుద్ధిశాలిని; తేఁకువ = ధైర్యము; దెప్ప రము = సహింపరానిది; విచారనీరధిన్ = చింతాసముద్రము నందు, మగ్నుఁడయి యేకత మొందనేరఁ డయ్యె నని యన్వ యము.

౨౬౬. ఉద్యత్ సంపత్ ఉన్మేషులు = ప్రకాశించుచున్న సంపదయొక్కవిలాసము గలవారు; విరసఆలాప = కఠినపు మాటలు గల కమల; ఇష్టోటిండికై=ఈదుష్టురాలకై.

౨౬౭. సంగడివారలున్ = స్నేహితులుగూడ; సైరిం

పఁగ=ఓర్చుటకు; వలంతులు=సమర్థులు; ఎవరు=ఎవరు? ఏది=చెడి; ఆలింపని=విననట్టి; లిబ్బులఁగ=ధనములచేతను; లాఁతులచేతఁగ=ఇతరులచేతను.

౨౬౮. తీవ్రతఁగ=తీక్ష్ణ మగుటచేత.

౨౬౯. యౌవనసంభృతంబు = యౌవనముచే వృద్ధిఁబొందింపఁబడినది; అర్థమదంబునఁగ = ధనగర్వముచేత; కోలుపోయితిఁగ=పోఁగొట్టుకొంటిని; ఒడ్లకుఁగ = ఇతరులకు; ఈ సుదురాసదశోకవారిధిఁగ=ఈ చెనకరానిదుఃఖసముద్రమును.

౨౭౦. రోయఁగఁగ = విచారించుటకు; తేర్చెడువారుఁబ=కాపాడుదురో.

౨౭౧. కనఁగ= చూడఁగా, ఇది వాక్యాలంకారార్థము; ప్రాణవల్లభకుఁగ=భార్యకు; సాకల్యంబునఁగ=సంపూర్ణతచేత; వేద్యము= ఎఱుంగఁదగినది; అది— మృదుభాషిణి, విజ్ఞానఆకరంబు= తెలివికి గని; విన్నంబాటు = దుఃఖమును; ఆకల్యాణనిధానమే = మంగళములకు గనియైన యామృదుభాషిణియే.

౨౭౨. భైషజ్యములు=ఔషధములను; పుస్తకక్రయణార్థము=పుస్తకములకొనుటకొఱకు.

౨౭౩. వగతుఁగ=ఆలోచింతును.

౨౭౪. వేచి=నిరీక్షించి.

౨౭౫. సదయతఁగ=దయతోఁ గూడినదగుటచేత; ప్రసాదము=నిర్మలభావము.

౨౭౬. గఱువతనము=గొప్పతనము.

౨౭౭. అమందశుద్ధభావభాసురము= గొప్పదైన నిర్మలమగు (నిష్కపట మగు) నభిప్రాయముచేఁ బ్రకాశించునది.

౨౭౮. అవివేకఆవిలులై = అవివేకముచే కలఁగినవారై; అరయమివలనన్ = తెలియకుండుటవలన; యథావిధి = శాస్త్రము చొప్పున.

౨౭౯. వేదవేదియుతవంశం బందున్ = వేదములతోను యజ్ఞములతోను గూడినవంశమునందు; అధ్వరయాజిఆత్మజన్ = యజ్ఞము చేసినవానికొమార్తెను; పది = చెడి; కాన్పు = కనుట; జనితఉద్రేకుండనై = కలఁగినగర్వము గలవాఁడనై; మహత్ భూదేవతాగ్రామణీ = గొప్పబ్రాహ్మణులయందుత్తముఁడా !

౨౮౦. చన్నవిధంబునను = తగినవిధముచేత; సన్నుతవిద్యాశాలివి = సత్పురుషులచేఁ బొగడఁబడినవిద్యచే నొప్పువాఁడవు; కన్నడ = ఉపేక్షను.

౨౮౧. ఆ బుధశేఖరుఁడు = ఆపండితోత్తముఁడు; ఆత్మలోన్ = మనస్సులోపల; ఊర్జితంబు = ఉత్తమము; అన్వయఉచితమున్ = నిజవంశమునకుఁ దగినదియు; సువిమర్శము = చక్కని యాలోచనమును.

౨౮౨. అర్హన్యాయఉక్తంబుగాన్ = తగిన న్యాయముతో (శాస్త్రనియమములతో)ఁ గూడినట్లుగా; వినుతఆమ్నాయవిధిన్ = పొగడఁబడిన వేదముయొక్క విధిచేత; తత్ అర్థంబు = ఆ యభిప్రాయమును; తాన్ — మధుకరుఁడు, మోదంబు = సంతోషమును; విషాదమున్ = దుఃఖమును — తాను కడతేఱుమార్గముఁ జెప్పెనని సంతోషమును ఆమార్గమునందలి కష్టముచే దుఃఖమును; నిజవరాంతగృహాంబున్ = తనరహస్యపుగదిని;

హృదయక్లేశంబు = మనస్సునందలి దుఃఖమును; సైఁపు = సహించుటను.

౨౮౩. విమనాయితుఁడై=దుఃఖము నొందినమనస్సు గలవాఁడై.

౨౮౪. వగవక=దుఃఖించుట; వాలాయము= అనివార్యముగా; వార్చెదరు=నిర్వహించెదరు; అలము= ఉపేక్షను.

౨౮౫. అపనయింపఁగ=పోఁగొట్టుటకు; నిజఆత్మప్రాణదయితక=తనప్రాణమువలెఁ బ్రియ మైనభార్యను.

౨౮౬. తద్ద= మిక్కిలి; పెద్దతడవు= చాలసేపు; వగచి= చింతించి.

౨౮౭. మహీదేవుఁడు = బ్రాహ్మణుడు, పురోహితుఁడు; వృద్ధసమ్మానితవృత్తి= పెద్దలచే గౌరవింపఁబడినయాచారము.

౨౮౮. ఇటక=ఇందు; ఒండుదేశమునక = ఇతరదేశమునందు; లేఖలక=జాబులచేత.

౨౮౯. విదేశవాసిపురుషుండె = ఇతరదేశమున నుండు పురుషుఁడే; అనాక=అని.

౨౯౦. విమలఆత్ముండై = నిర్మల మయినమనస్సు గలవాఁడై; గీష్పతిసదృశుండు = బృహస్పతితో సమానుఁడు; ఆర్తి=దుఃఖమును; కర్తవ్యము=చేయవలసినదాని; కార్యము వెంటక=పనిమీఁద.

౨౯౧. తత్ నికటంబునకుక=ఆమధుకరునియొద్దకు.

౨౯౨. ప్రమోదఉచ్ఛలితహృదయుఁడు= సంతోషముచే మీఁది కెగసినమనస్సు గలవాఁడు; తత్ చరితములు = వారు సంచరించినవి.

౨౯౩. నిర్ణయము=నిశ్చయమును.

౨౯౪. ధరణీసురకులుండు=బ్రాహ్మణకులము గలవాఁడు; అంబుజరిపుతుల్యుండును=చంద్రునితో సమానుఁడును.

౨౯౫. అలఘుప్రీతిన్=గొప్పసంతోషముతో; లలిన్=సంతోషముతో.

౨౯౬. అంకంబునన్=బిరుదుచేత; అంకితముగన్=లెక్క పెట్టినట్లుగా.

౨౯౭. అతనుఉజ్జ్వలరూపుఁడు = మన్మథునివంటి ప్రకాశించుచున్న రూపము గలవాఁడు; ఆయతనము=ఇల్లు.

౨౯౮. ఈరు=మీరు; కార్యశేషము = కార్యమునందు మిగత.

౨౯౯. అని పల్కన్—అని నిర్ణయమును జెప్పఁగా నని ౨౮౩ వ పద్యముతో నన్వయము. విత్తమునకై = ధనము కొఱకు; నాన్=అని చెప్పఁగా.

౩౦౦. అవారితులై=అడ్డు లేనివారలై; అకుంఠితబుద్ధి=మొక్కపోవనిబుద్ధి గలవాఁడు; మధువ్రతుండు=మధుకరుఁడు; సభాజనమున్= పూజను; సమ్మదంబు = సంతోషము; సల్లపనంబు=సంభాషణమును.

౩౦౧. కల్మియున్=సంపదను; యథార్థము= తగినట్లు; వారిజనేత్రి= కమలములవంటికన్నులు గలది; నీసుతకున్= నీ కొమార్తెకు; నావుడున్=అని చెప్పఁగా.

౩౦౨. ఇర్వురమురువు = ఇద్దఱచక్కఁదనమును; ప్రమితి ఎ=ప్రమాణమా? భామిని= మృదుభాషిణీ; డెందమునన్=

మనస్సునందు; అభిమతంబును=అభిప్రాయమును; విడఁగన్= స్పష్టముగా.

౩౦౩. అగ్రసుతన్ = పెద్దకూఁతును; విన్ననువునన్= ఉపాయముచేత; కినియంగ నేరన్ = కోపము చేయను; మది పూనికిన్= మనస్సునందలి కోరికను; చిత్తగతంబున్ = మనోగతమును.

౩౦౪. హృత్ ఈశులు=మగలు; మీయాపాశంబునన్= మీయొక్కయాత్రాటిచేత.

౩౦౫. కడవన్ = దాఁటునట్లు; ఆవారడిన్= ఆలోపము చేత.

౩౦౬. తలంచిన యేన్=తలంచిన యెడ; అమదంబునన్= సంతోషము లేమిచేత.

౩౦౭. పృథ్వీస్థలిన్=భూప్రదేశమునందు.

౩౦౮. హీనగతిన్=విడువఁబడిన దిక్కుగల నేను.

౩౦౯. మెయిమెయిన్ = సులభముగా; దాదాలన్ = మిక్కిలి దూరముగా; ఔదానికిన్—జరగ నిశ్చయించినదానికి.

౩౧౦. కొంకుపటిచెదున్=సంకోచపడుచు చున్నది.

౩౧౧. అలభేషజంబువానిన్=ఆమందులు చేయువానిని; కలితకలాకౌశలుండు = పొందఁబడినవిద్యలందు నేర్పు గలవాఁడు; ఒల్లదు=ఇష్టపడదు; ఉల్లంబు=మనస్సు.

౩౧౨. ఘనశోకమోహముల్ = గొప్పదుఃఖమును అనురాగమును; వెల్లిగొనఁగన్=ప్రవాహము గాఁగా; ఉదితబాష్పరోధవికలకంఠుఁడై = పుట్టినకన్నీటి నడంచుటచే పరవశమైన కంఠము గలవాఁడై.

౩౧౩. వినదానికిఁ=జరగినదానికి; కానిదానికిఁ= అశక్య మయినదానికి; కనలఁ=కోపించుట; దేశకాలయుక్తమై= ఈదేశమునందును ఈకాలమునందును తగినదై; శర్మదంబు= సుఖము నిచ్చునది.

౩౧౪. శ్రీకిఁ= సంపదకును; పెంపునకుఁ = గొప్పతనమునకును; సేగి = కొఱఁత; వ్యాకులతయుఁ = దుఃఖమును; కొంకుఁ=సంకోచమును; పంకజవదనా=కమలమువంటిముఖము గలదానా.

౩౧౫. అకలంకముగఁ=దోషము లేనియట్లు; కాచుఁ= రక్షించును; నీమనంబు నెఱిఁ = నీయభిప్రాయముయొక్కవిధమే; నెఱయఁజూతుఁ=నిండునట్లు యత్నింతును.

౩౧౬. అంకనామునిఁ=అంకాజి యనుపేరు గలవానిని; లలితోద్ధఁ=సంతోషముతో.

౩౧౭. తనసతియుఁ = తనభార్యయును; సుతయుఁ= కూఁతురును; పర్వంబునఁ = ఉత్సవముతో; ప్రమదము= సంతోషము.

౩౧౮. అతిముదమునఁ = మిక్కిలి సంతోషముతో; తర్పితునిఁ=తృప్తి నొందింపఁబడినవానిఁగా.

౩౧౯. ఉచితసత్కారముఁలను = తగినసమ్మానములచేత; ధన్యులనుగఁ = పుణ్యము గలవారినిగా; దుర్భరమయి = మోయ నలవిగానిదై; అత్తమిల్లు = ఒఱగియుండు; అభారవాహిపగిదిఁ ఆఁబరువు మోయువానివలె.

౩౨౦. నందనావిరహమునను=కూఁతు నెడఁబాటుచేత;

చూఱవోవు=కొల్లపోవు; తొడరదు అయ్యెన్ = తాఁక లేదు; పొందు=సౌఖ్యము.

3౨౧. ఊర్జితవాసరము= ఉత్తమదినము; చేర్వ=సమీపము; పరమయత్నతన్= గొప్పపూనికి గలవాఁ డగుటచేత; పురుహూతగురుఉపమున్=ఇంద్రునిగురువైనబృహస్పతితోఁ బోలికి గలవానిని; స్వపరిసరంబున్ = తనసమీపమును- తన యొద్దకు రావించి యనుట. ద్వితీయపుత్త్రిపరిణయంబు=రెండవకొమార్తె పెండ్లిని; తీవరపాటు త్వర.

3౨౨. ద్విజకులవర్య = బ్రాహ్మణకులమునం దుత్తముఁడా ! ద్వితీయతనూజకున్ = రెండవకూఁతునకు; జతనము= యత్నమును; సుజనసమాజవంద్యుఁడు = సత్పురుషులసమూహముచే నమస్కరింపఁ దగినవాఁడు; సువ్రతుఁడు = మంచి నోములు గలవాఁడు; శివసోమయాజియాత్మజునకున్ = శివ సోమయాజికుమారునకు.

3౨3. అగ్రజన్ముండు = బ్రాహ్మణుఁడు, పురోహితుఁడు; వడువువాసరంబె=వడుగునకుఁ బెట్టినదినమే; వడువు=రీతి.

3౨౪. తృతీయతనూజయుద్వాహమునకు = మూఁడవ కూఁతుపెండ్లికి; ఆత్మలోన్=మనస్సులో.

3౨౫. మూర్తంబు= ముహూర్తము; ఉదియ = యత్నమును; పదింబదిగన్=చక్కగా; వస్తువర్గమున్= పదార్థముల సమూహమును.

3౨౬. శివయజ్వపెంపుసంపదలు = శివసోమయాజి యొక్కగొప్పతనమును సంపదలును; క్రొత్తలుఅ— తెలియనివి

యనుట. తవిలినచుట్టంబు = దగ్గఱచుట్టము; తపనీయాంగీ= బంగారమువంటి మేనుగలదానా!

౩౨౭. హూణవిద్య = ఇంగ్లీషుచదువు; ఊనంబు = కొఱంత; తక్కు= మిగిలినవి; విదితబుద్ధి = ప్రసిద్ధ మయిన తెలివి గలవాఁడు; అభిరూపగుణఉజ్జ్వలుఁడు = చక్కనిగుణములచే ప్రకాశించువాఁడు.

౩౨౮. నెయ్యంబునన్ = స్నేహముచేత; ఇయ్యకొనంగన్=అంగీకరింపఁగా; కొనలొత్తగన్=వృద్ధిపొందు చుండఁగా.

౩౨౯. అత్యంతముదంబున్ = మిక్కిలి సంతోషమును; ఆప్తబంధుసంబంధముచేన్=ఇష్టబంధువులతోడి వియ్యముచేత.

౩౩౦. దుహిత=కూఁతు రగు; చిరబద్ధఆశుండు= బహుకాలముగా కట్టఁబడినయాశ గలవాఁడు; అనయము=మిక్కిలి; ప్రతిబంధవినాశనమునన్ = అడ్డు (కమలసంబంధము) యొక్క నశింపఁ జేయుటచేత.

౩౩౧. అనంతము = కడలేనిది; ఆ శుభవర్తనంబు = ఆ మంచియాచారము; తాన్ -- దినకరుఁడు, ఆశుగతిన్ = శీఘ్రగమనముచేత; విరుద్ధచరితఅంధతమిస్రము = దురాచారము అను కటికిచీఁకటి; పాయన్ = తొలఁగఁగా; శతపత్రమిత్రుని క్రియన్=సూర్యునివలె -- చీఁకటి తొలఁగఁగా సూర్యుఁ డుదయించునట్లు మధుకరుని దురాచారము తొలఁగఁగానే వాని యింటికి దినకరుఁడు వచ్చె నని తా.

౩౩౨. ఎలమి=సంతోషము.

౩౩౩. సమ్మదంబు = సంతోషము; పొరిన్ = మిక్కిలి; సతతఅమందఉత్సవము=ఎడ తెగని గొప్ప వేడుక.

౩౩౪. చేరువ = సమీపము; ప్రముదితలు = మిక్కిలి సంతోషించినవారు; ముదితలు=స్త్రీలు; భావుకము=మంగళకరము; తానము = స్నానము; సుతులకున్ = దమనదుర్దములకు; కొమరితకున్=విమలకు; దంపతులకున్=మృదుభాషిణీ మధుకరులకు.

౩౩౫. సమయఅతిక్రమదోషము = ఉపనయనకాలము దాటుటచేఁ గలిగినదోషము; సమయుఁగన్ = నశించునట్లు.

౩౩౬. మణికాంచనమయశుభభూషణభాసురన్ = రత్నములచేతను బంగారముచేతను జేయఁబడినమంచిసొమ్ములచేతఁ బ్రకాశించుదానిని; విమలచారుతరాంగిన్ = నిర్మల మయిన మిక్కిలి చక్కనిదేహము గలదానిని; గుణరూపయుతుఁడు= మంచిగుణములతోను రూపముతోను గూడినవాఁడగు; మణిధనగోభూయుతముగన్ = రత్నములతోను ధనముతోను ఆవుతోను భూమితోను గూడినట్లుగ.

౩౩౭. భూదేవప్రతతిన్ = బ్రాహ్మణులసమూహమును; మహార్హవసనంబుల్=ఉత్తమము లయినవస్త్రములను; భూరివిత్తంబులున్ = అధిక మయినధనములను; స్వాదుశ్రేష్ఠచతుర్విధఅన్నములున్=రుచిగల యుత్తమములైన నాలుగువిధములయినయన్నములను; ఇష్టస్రక్విలేపంబులున్ = ప్రియములయిన పూదండలను గంధమును; ప్రోదిన్ = వైభవముచేత; తనిపెన్ =తృప్తిఁబొందించెను, భూదేవప్రతతికర్మము. భూవిశ్రుతంబై =భూమియందుఁ బ్రసిద్ధమై; ఔదార్యంబు=దాతృత్వము; అత్యంతసంప్రీతుఁడై =మిక్కిలి సంతోషించినవాఁడై.

౩౩౮. మణిభూషాఅంబరతిల్లజప్రకర సమ్మానప్రదానం

బులన్=రత్నాభరణములయు ఉత్తమవస్త్రములయు సమ్మాన ముచే నిచ్చుటలచేత; పణితఅనేకకలాప్రసంగముల్=పొగడం బడిన పెక్కువిద్యలప్రస్తావములచేతను; దీవ్యత్ నృత్తగీతంబు ల్=ప్రకాశించుచున్న యాటపాటలచేతను; గుణవత్ కావ్య రసజ్ఞవిజ్ఞజనతాగోష్ఠిన్=గుణవంతులై కావ్యరసము నెఱింగిన పండితజనులసమూహముయొక్క సహవాసముచేతను; యథార్థవాజ్ఞతాచణుఁడు=ఉచితత్వ మెఱుంగుటచేఁ బ్రసిద్ధుఁడు.

33క. మహితశాస్త్రఅంభోధిమథనసంపాదితజ్ఞానఅమృతఆస్వాదులు=గొప్పశాస్త్రము అనుసముద్రము చిలుకుటచేఁ బొందఁబడినజ్ఞానము అనునమృతమును జవిచూచినవారు; సరసనిర్దోషబంధురకావ్యవరశిల్పకల్పనాకౌశలఖనులు = రసవంతములును దోషములేనియుఁ జక్కనివియు నగు నుత్తమ కావ్యముల శిల్పములరచనయందు నేర్పునకుగనులు; అఖిల పురాణఇతిహాసతాత్పర్యసర్వంకషమతులు = ఎల్లపురాణము లయు నితిహాసములయు తాత్పర్యమును జక్కగా గ్రహించు నట్టి బుద్ధిగలవారు; స్వస్వవర్ణఉచితఆచరణప్రవీణులు = తమ తమవర్ణములకుఁ దగినవాని ఆచరించుటయందుఁ బండితులు; అతులధనరత్నకనకభూషాఅర్హవసన దాన మాన ఆది వివిధ సత్కారములను = సాటిలేని ధనముయొక్కయు మణులయు బంగారుసొమ్ములయు నుత్తమవస్త్రములయు నిచ్చుటయు గౌర వించుటయు మొదలుగాఁగల నానావిధములయిన పూజల చేతను; అభినవచతుర్విధఇష్టమృష్టఅన్నములను=క్రొత్తవియు నాలుగువిధములును బ్రియములును నుత్తమములు నగు అన్న ములచేతను.

౩౮౦. సముచితఅర్చలన్ = మిక్కిలి తగినపూజలచేత; అర్చితులు – పూజింపఁబడినవారు; సతీసుతసమావృతుఁడై = భార్యచేతను కూఁతులకొడుకులచేతను చుట్టఁబడినవాఁడై; వేదరహస్యవేది=వేదములరహస్యము నెఱింగినవాఁడు; బుధవిశ్రుతుఁడు = పండితులందుఁ బ్రసిద్ధుఁడు; చారిమఉజ్జ్వలములు=మనోజ్ఞతచేఁ బ్రకాశించునవి.

౩౮౧. ఉవిదలుఎ=స్త్రీలే; ఈభవమునన్ = ఈపుట్టువునందు; ధర్మరూపముల్=ధర్మముయొక్కఆకారములు; చోదితంబు=విధింపఁబడినది; ఉజ్జగింపఁగన్ కాదు = విడువఁదగదు— స్త్రీలే తల్లులైనను తన్నుఁగన్నస్త్రీ యొక్కతెయే తనకీజన్మమునఁ దల్లి యగునట్లు అనేకవిధముగాఁ జెప్పఁబడినధర్మములన్నియు ధర్మములే యైనను తానుబుట్టినవర్ణమున కేది విధింపఁబడినదో అదియే తనకు స్వధర్మమగును, దానిని విడువఁగూడ దని తా.

౩౮౨. ఒకతెన్=మఱియొకస్త్రీని; జాయ=భార్య; తనూజయున్=కొమార్తయు; పరధర్మము=ఇతరులకు విధింపఁబడినధర్మము; భీకరంబు=తనకు భయముఁ గలిగించునది.

౩౮౩. ఉదితుఁడవు=పుట్టినవాఁడవు; వైదికుల= వేదము నెఱింగినవారియొక్క; మేదినిన్ = భూమియందు; విదితులు= ప్రసిద్ధులు; సత్ అమలబుద్ధిన్=మంచినిర్మల మయినబుద్ధిచేత; ఆంగ్లకలన్ = ఇంగ్లీషువిద్యయందు; చాతురిన్ = నేర్పుచేత; స్వభావజధర్మమున్=స్వభావమువలనఁ గలిగినధర్మమును, నీ బ్రాహ్మణవర్ణమునకుఁ దగినధర్మము ననుట. నాన్ – అని పురోహితుఁడు చెప్పఁగా.

౩౪౪. పురోధః = పురోహితుని; సుస్మితముఖయై = మంచిచిఱునగవు మోమునందుఁ గలదై.

౩౪౫. ఈచరితకుః = ఈ సదాచారమునకు; కృతమతులారా = శిక్షింపఁబడినబుద్ధి గలపండితులారా! ఈ చంద్రసుందరఆస్యను=చంద్రునివలెఁ జక్కనిమోముగల యీమనోరమను.

౩౪౬. పోనాడుః = పోఁగొట్టును; తమము = అజ్ఞానమును, చీఁకటిని.

౩౪౭. పూర్వజన్మభావితధర్మంబు = మునుపటిజన్మమునందు భావనచేయఁబడిన (మనస్సునఁ బట్టియున్న) ధర్మము. ప్రతిబంధంబు=అడ్డు.

౩౪౮. జలజాక్షి = కమలములవంటికన్నులు గలది; భావి=కలుగఁబోవునది; తివురః=కోరుటకు.

౩౪౯. విశిష్టఆప్తగణంబును = ఎల్లచుట్టాల సమూహమును.

౩౫౦. ప్రణయంబునః = స్నేహముతో; ఏతత్ ఘనతయుః=ఈకూఁతుయొక్క గొప్పతనమును.

౩౫౧. ప్రభూతప్రీతిః=అధికమయినసంతోషముచేత.

౩౫౨. కాంతతరవసనభూషణసతతిః = మిక్కిలిసుందరములైన వస్త్రములయు సొమ్ములయు సమూహముచేత.

౩౫౩. సుమతిసంస్కృతవాక్పరిశ్రమముః = సుమతియొక్క సంస్కృతభాషయందలి నేర్పును; ఆంగ్లవిద్యాజ్ఞులు=ఇంగ్లీషుభాష నెఱింగినవారు; హ్రీణులు = సిగ్గుపడినవారు; త్రిదశభాషః=సంస్కృతమును.

3౫౫. నింపునన్ = సమృద్ధిచేత; నెలవులకున్ = స్వస్థలములకు.

3౫౬. తారుఅ—మృగభాషిణీమధుకరులే.

3౫౭. అపారవిభూతిసమేతులై = కడలేనిసంపదతోఁ గూడినవారై.

3౫౮. బాంధవసముదయము= బంధువులసమూహము; సింధువు=సముద్రము; బంధురవైదికధరణీసుధాంధులపెంపు= ఉత్తములైన వైదికబ్రాహ్మణులగొప్పతనము.

3౬౧. మహార్హకాంచనభూషాకాంతతరఅంగిన్ = ఉత్తమము లైనబంగారుసొమ్ములచే మిక్కిలి సుందర మయినదేహము గలదానిని.

3౬౨. నవ్యదివ్యజాంబూనదభూషాఅంబరలసితన్ = క్రొత్తవియు నుత్తమములు నగు బంగారుసొమ్ములచేతను వస్త్రములచేతను బ్రకాశించుదానిని.

3౬౩. వసుధాసుపర్వవారమున్ = బ్రాహ్మణసమూహమును; భూరిసుచేలప్రదానములన్ = బంగారముయొక్కయు మంచివస్త్రములయొక్కయు నిచ్చుటలచేత.

3౬౪. నిజబంధువ్రతతుల్ = తమబంధువులసమూహములును; సుహృత్ వితతులున్ = స్నేహితులసమూహములు; ప్రస్తుతివచఃఅశూన్యఆననఅంభోరుహవ్రజలై = స్తోత్రవాక్యములచే శూన్యములుకాని కమలములవంటి ముఖములసమూహము గలవై, పొగడుట తప్ప వేఱుమాట లాడనేరక యునుట. భుజివ్యాపారపారీణతన్ = భోజనకార్యముయొక్కతుదముట్టినవా రగుటచేత.

౩౬౫. ప్రణుతసంతతభూరిదక్షిణలచేతన్ = పొగడఁబడిన యెడ తెగని గొప్పదక్షిణలచేత.

౩౬౬. తానున్—మధుకరుఁడును, బ్రాహ్మధర్మపరతన్= బ్రాహ్మణులదైనధర్మమే ప్రధానముగాఁ గలవాఁడగుటను; మధువ్రతుండు— మధుకరుఁడు, విధిచోదితము= శాస్త్రముచే విధింపఁబడినది.

౩౬౭. అనితరదృష్టము = ఇతరులయందుఁ జూడఁబడినది కానిది; అహీనశుభఅశుభవేదనుండు=గొప్పదైన మేలుగీడుల జ్ఞానము గలవాఁడు.

౩౬౮. నియతధర్మఆయత్తచేతస్కులన్ = నిత్యమయిన ధర్మమున కధీనమైనమనస్సు గలవారిని; తదీయధర్మపరతా గంధఅభిసంబంధమాత్రన్=వారిదైన ధర్మాసక్తియొక్క వాసన తగులుటమాత్రముచేత; ధర్మరతి=ధర్మమునం దాసక్తి; శుభ ఆస్పదము=మేలునకుఁ జోటు.

౩౭౧. ఒక్క ప్రణయంబు అది = ఆస్నేహ మొక్కటే; మృదుభాషిణీసతి మనఃఅంబుజమాధ్వీ=మృదుభాషిణి యను పతివ్రతయొక్క మన స్సనుకమలమునందలి తేనె; సత్‌చరిత ఆత్మున్ = సదాచారము గల స్వరూపము గలవానిని; గాఢ శోకము=గొప్పదుఃఖము.

౩౭౨. తగవునకున్ =ధర్మమునకు; నైజసుచరితన్ = తన సదాచారముచేత.

౩౭౭. అఖండఆనందసాంద్రంబుగాన్ =ఎడతెగనియానందముచే నిండినదిగా; అత్యంతసత్‌ధర్మపటుభావంబు=మిక్కిలి మేలిధర్మబుద్ధియందు దృఢత్వము; దారపుత్త్రాత్మజాభటసం

దోహముఁ=భార్యయొక్కయు కొడుకులయు కూఁతురయొక్కయు నౌకరులయు సమూహమును.

౩౭౯. హీరఆదులతోఁ = వజ్రములు మొదలగువానితో.

౩౮౦. అమేయధనము=కొలఁదిలేని ధనమును.

౩౮౧. దానసమర్చనాఆదివిధిః = ఇచ్చుట పూజించుట మొదలగు కార్యముచేత; బహుమానవిశాలయశంబు= గౌరవముచే గొప్పదైనకీర్తిని.

౩౮౨. పక్షిమతఅనువాసులై = పక్కిలై; శుభఆయుః అనామయతామహాసుఖస్ఫీతశరీరులై = గొప్పఆయుస్సుచేతను రోగము లేమిచేతను గొప్పసుఖముచేతను ఒప్పుచున్న దేహములు గలవారలై.

౩౮౩. తత్ఆప్తులు=వానిచుట్టాలు.

౩౮౪. వినిశ్చితచిత్తయై=నిశ్చయించినమనస్సు గలదై.

౩౮౫. తత్వృత్తము = ఆకమలవృత్తాంతము; క్ష్వేడీయులు= మిక్కిలియల్పులు; అనయాత్మన్ = నీతిమాలినమనస్సుతో; తలపెట్టునూతనదురర్థఅబంధుసంబంధముః = ఆరంభించునట్టి క్రొత్తదియు చెడుప్రయోజనముగలదియు నగు చుట్టాలు కానివారితోడిసంబంధమును.

౩౮౬. ప్రమితిఅతీతసుఖభోగభాగిని = కొలఁదిమీఱిన సుఖము ననుభవించుటను బొందినది; బహువిధక్రతుసమితిసమారాధితసురసముదాయునితోఁ = పలువిధములైన యజ్ఞములసమూహముచేఁ బూజింపఁబడిన దేవతాసమూహము గలవానితో.

౩౯౧. మండలాధిపసమూహములోపలన్ = కలెక్టరుల సమూహములో.

౩౯౩. సుశీలాప్రమదను=సుశీల యను స్త్రీని.

౩౯౪. దేవేజ్యున్=బృహస్పతిని; సురేంద్రున్ = దేవేంద్రుని; ధీయును శ్రీయున్—క్రమాన్వయము.

౩౯౫. శ్రీమహిమన్=లక్ష్మీదేవియొక్క గొప్పతనమువంటి గొప్పతనముచేత; మహిలాలలామమై = స్త్రీలయం దుత్తమమై.

౩౯౮. సంతతవనీపకసాత్కృతవిత్తరాశియై = ఎల్లప్పుడును యాచకులయధీనముగాఁ జేయఁబడినధనరాశి గలవాఁడై.

౪౦౧. సంతతఇష్టనమనప్రతిపాదనమృష్టభూరిభోజనములన్ = ఎల్లప్పుడును యజ్ఞములచేతను నమస్కారములచేతను దానములచేతను ఉత్తమమును అధికము నగు భోజనముల చేతను యజ్ఞములు మొదలగువానికి దేవతాతతి మొదలగు వానితోఁ గ్రమాన్వయము.



